# రా ఘా రా ణి

చాలకాలంనాటి సంగతి. సత్యేంద్రనాథబాబుగారి ఒక జమీందారుబిడ్డ. అతను బి.ఏ. పాసయి యింటికి వచ్చేప్పటికి "ఆ పిల్ల సరీగ్గా లక్ష్మిలాగ వుంది. ఒకసారి వెళ్ళి నీ కళ్ళతో చూచి రా నాయనా!" అన్నది తల్లి.

సత్యేంద్రుడు తలకాయ తిప్పుతూ "వద్దమ్మా, ఇప్పు డిప్పుడే పెళ్ళిచేసుకోను, చేసుకుంటే పరీక్ష ప్యాసవలేను" అన్నాడు.

"ఎందుకు ప్యాసుకాలేవు? కోడలు నాదగ్గర వుంటుంది, నీ చదువు కలకత్తాలో. పెళ్ళిమూలాన నీ చదువు కేమి విఘ్నం కలుగుతుందో నా కేం అర్థంకావటంలేదు" అన్నది తల్లి.

"ఎలాగైనా బాగుండలేదు అమ్మా! సరే, ఇప్పుడు నాకు అవకాశం లేదు. వెళతాను" అని సత్యేంద్రుడు బైటికి వెళ్ళబోతూవుండేప్పటికి తల్లి మళ్ళా పిలిచి "ఇంకోమాట విని పో నాయనా! నేను వారికి మాట యిచ్చాను. నా మాట దక్కించవా ?" అన్నది.

సత్యేంద్రుడు వెళ్ళబోయినవాడల్లా ఆగి కొంచెం అసంతృప్తితో "నన్నడగకుండా వారి కెందుకు మాట యిచ్చావు ?" అన్నాడు.

కొడుకుమాట విని తల్లికి మనసులో చాల కష్టం కలిగింది. "ఏదో నావల్ల పొరపాటు జరిగింది. కాని నువ్వు నీ

తల్లిమాట దక్కించక తప్పదు. అదీగాక ఆమె తండ్రి లేని బిడ్డ, చాల దీనురాలు! నా మాట విని వప్పుకో నాయనా!" అన్నది.

"అయితే, మళ్ళా మాట్లాడతాను" అని సత్యేంద్రుడు బైటికి వెళ్ళిపోయాడు. తల్లి చాలసేపటివరకు మెదలకుండా అక్కడే నుంచున్నది అతనే ఆమెకు ఒక్కగా నొక్క బిడ్డ. భర్త పోయి పదెనిమిదేళ్ళయింది. పాప మా విధవతల్లే ఈ పదెనిమిది సంవత్సరాలనుంచీ గుమాస్తాల సాయంతో జమీం దారీని సాకుతూవచ్చింది. కొడుకు కలకత్తాలో ఏదో కాలే జీలో చదువుతున్నాడు. ఈ జమీందారీ వ్యవహారాలలో అత నికి జోక్యమే లేదు. కొడుకు ప్లీడరీ పాసయి వచ్చినతర్వాత పెళ్ళిచేసి ఈ జమీందారీభారమంతా కొడుకూ-కోడలినెత్తిన వుంచి తను నిశ్చింతగా వుందా మనుకున్నది వృద్ధతల్లి. ఈ లోగా వివాహంచేసి కొడుకు వున్నతవిద్యకు విఘ్నం కలిగించ ననుకున్నదికూడా. కాని మధ్యలో ఆమె వుద్దేశం మారింది.

భర్త చనిపోయినతర్వాత ఈ పదెనిమిదేళ్ళలో వారింట శుభకార్యాలేమీ జరగలేదు. ఆ రోజున ఏదో వ్రత మని వూరందరినీ విందుకు పిలిచారు. స్వర్గీయ అతులచంద్రముఖర్జీ, పేదఇల్లాలుకూడా పదకొండేళ్ళ కుమార్తెను వెంట వేసుకు వచ్చింది. సత్యేంద్రునితల్లికి ఆ పిల్ల చాల నచ్చింది. కేవలం అందమే కాకుండా ఈ చిన్నవయసులోనే వినయవిధేయతలు మొదలైన సద్గుణాలుకూడా ఆమెలో మూర్తీభవించి యున్నా యని ఆమె రెండు మాటలలోనే గ్రహించింది.

అబ్బాయి పిల్లను చూస్తే ఎందుకు నచ్చదో తర్వాత చూస్తాను-అనుకున్నది మనసులో.

మర్నాడు ఉదయాన వంటింట్లోకి భోజనానికి వచ్చి చూచినప్పుడు సత్యేంద్రుడు స్తంభించిపోయాడు. అతనికి వేసిన పీటకు ఎదురుగా వంటినిండా నగలతో వైకుంఠలక్ష్మి అన్నట్టు ఆ పిల్ల కూర్చుని వుంది.

తల్లికూడా వంటింట్లోకి వచ్చి "కూర్చుని, భోంచెయ్యి నాయనా!" అన్నది.

సత్యేంద్రునికి ఒక్కసారి మత్తు వదిలించినట్లనిపించింది. కొంచెంసేపు తప్పుళ్ళాడి "ఇక్కడెందుకు? నే నింకెక్కడైనా అవతల కూర్చుని భోంచేస్తానులే" అన్నాడు.

తల్లి చిరునవ్వుతో "నిజంగా నీకేం పెళ్ళి చేయబోవటం లేదులే. ఈ చిన్నపిల్లముందు నీ కింత సిగ్గెందుకు?" అన్నది.

"నాకు ఎవరిముందూ సిగ్గు లేదు" అని సత్యేంద్రుడు అసంతృప్తితోనే ఎదురుగా పీటమీద కూర్చున్నాడు. తల్లి అక్కడనుంచి వెళ్ళిపోయింది. సత్యేంద్రుడు రెండు నిమిషాలలో ఏదోవిధంగా భోజనంముగించుకొని లేచి వెళ్ళిపోయాడు.

బైట గదిలోనికి వెళ్ళి చూచేప్పటికి-స్నేహితులొచ్చి కూర్చుని చీట్లపేక ప్రారంభించారు. అతను వచ్చీరావటంతోనే అయిష్టం కనపర్చుతూ "నాకు తల నొప్పిగా వుంది" అని ఒక మూలకు వెళ్లి పండుకున్నాడు. స్నేహితులకి చాల ఆశ్చర్యం కలిగింది. చేతులు తక్కువయ్యేప్పటికి చీట్లపేక తీసివేసి చదరంగం పరిచారు. సాయంత్రంవరకు అనేక ఆటలు ఆడారు, అనేక పందాలు వేశారు, అనేక సంభాషణలు జరిగినాయి, అనేక ప్రసంగాలు వచ్చాయి. కాని సత్యేంద్రుడు అక్కడ నుంచి లేచి-ఎవరు ఓడారు, ఎవరు గెల్చారని అడగటంగాని,

వారి సంభాషణలలో పాల్గొనటంగాని జరగలేదు. ఇవ్వాళ ఇవేవీ అతనికి నచ్చలేదు.

స్నేహితులంతా వెళ్ళిపోయినతర్వాత సత్యేంద్రుడు లేచి తిన్నగా పడకగదిలోకి వెళ్లబోతూవుండేప్పటికి తల్లి వంటింట్లోంచి చూచి "ఇప్పటినుంచి పండుకోటానికేనా వెళ్ళేది ?" అన్నది.

"పండుకోటానికి కాదు, చదువుకోటానికి వెళుతున్నాను. ఎం.ఏ. చదువు సామాన్యచదువు కాదు, నిమిషం వ్యాయపర్చటానికి వీలుండదు" అని సత్యేంద్రుడు గబగబ గదిలోనికి వెళ్ళిపోయాడు.

అరగంట గడచిపోయినా అతను ఒక పంక్తికూడా చదవలేకపోయాడు. పుస్తకం తెరచి ముందు టేబులుమీద పెట్టి, పడకకుర్చీమీద కాళ్ళారజాపుకుకూర్చుని ధ్యానంతో పైకప్పు వాసాలు లెక్కపెడుతున్నాడు. అకస్మాత్తుగా అతనికి ధ్యానభంగ మైంది. 'ఘల్లు' మని మోత వినిపించింది. చెవి యొగ్గి విన్నాడు. నిమిషంసేపుండి మళ్ళా 'ఘల్లు, ఘల్లు' మన్న శబ్దం వినిపించింది. లేచికూర్చున్నాడు. ఆపాదమస్తకం ఆభూషణాలు ధరించిన లక్ష్మీస్వరూపిణి మెల్లమెల్లగా అడుగులిడుతూ గదిలోకి వచ్చింది. కోమలస్వరంతో "అమ్మ మీ వుద్దేశం కనుక్కురమ్మన్నది" అన్నది.

సత్యేంద్రుడు కొంచెంసేపు మెదలకుండా వుండి "ఎవరమ్మ ?" అని అడిగాడు.

"మా అమ్మ" అన్నది పిల్ల.

దీనికేమీ సమాధానం దొరక్క సత్యేంద్రుడు కొంచెంసేపుండి "మా అమ్మ నడుగు, తెలుస్తుంది" అన్నాడు.

పిల్ల గదిలోంచి వెళ్ళిపోబోతూవుండేప్పటికి చటుక్కున "నీ పే రేమిటి ?" అని అడిగాడు సత్యేంద్రుడు.

"నా పేరు రాధారాణి" అని చెప్పి పిల్ల వెళ్ళిపోయింది.

## — ౨

ఆ చిన్నరాధారాణిమీదనుండి పట్టిబలంతాన ధ్యానం తిప్పుకొని సత్యేంద్రుడు ఎం. ఏ. ప్యాసవటానికి కలకత్తా వచ్చాడు. విశ్వవిద్యాలయపరీక్ష లన్నీ ప్యాసవందే, వీలైతే ఆ తర్వాతకూడా ఎలాంటి పరిస్థితులలోనూ పెళ్లిచేసుకో నని అతను నిశ్చయించుకొన్నాడు. సంసారచిక్కుల్లో పడితే మానవుని ఆత్మగౌరవం నాశన మౌతుం దనీ, ఇలాంటివే యింకెన్నో అతనికి తెలియని కారణాలు అతని మనసులో మెదులుతున్నాయి.

ఎప్పుడైనా, ఎక్కడైనా ఏ స్త్రీముఖ మైనా కనపడితే దానివెంట మరో చిన్నముఖం ఉన్నట్టుండేది. చిన్నముఖం పెద్దముఖాన్ని కనబడకుండా కప్పేస్తూవుండేది. ఈ విధంగా అతను ఎంత ప్రయత్నించి ఆ చిన్నముఖాన్ని మర్చిపోలేకపోయాడు.

ఆసలు అత నెప్పుడూ స్త్రీలయందు వుదాసీనభావంతో వుండేవాడు. కాని అకస్మాత్తుగా ఏమి జరిగిందో ఏమో, దారిలో యెక్కడైనా ఏ వయసుపిల్ల కనిపించినా - ఆమెను ఇప్పుడు కళ్ళారా చూడా లనిపిస్తూవుంది. ఎంత ప్రయత్నించినా ఆ వైపునుంచి తన దృష్టిని మరల్చుకోలేకపోతున్నాడు. చూస్తూ చూస్తూ అకస్మాత్తుగా సిగ్గుతో అతని శరీరమంతా

పులకరించినట్లు చప్పున మొహం తిప్పుకునేవాడు.

సత్యేంద్రుడికి ఈత అంటే చాల యిష్టం. అతని ఇంటికీ గంగానదికీ అట్టే దూరం లేకపోవటంవల్ల అతను తరచుగా జగన్నాథ్ రేవుకు స్నానానికి వెళుతూవుండేవాడు.

అవ్వాళ పౌర్ణమి. రేవుదగ్గర జనం గుంపులు గుంపులుగా కూడుకున్నారు. రేవుదగ్గరకు వచ్చి తను రోజూ పొడి బట్టలు పెట్టి స్నానానికి వెళ్లే వడియా బ్రాహ్మడివద్దకు వస్తూ వుండేప్పటికి నలుగురైదుగురు ఒకేవైపుకు వింతగా చూస్తున్నారు. తన దృష్టినికూడా అటే ప్రసరించాడు. చూచీ చూడటంతోనే ఆశ్చర్యంతో స్తంభించిపోయాడు. అతనింత వరకు ఏ స్త్రీలోనూ ఇంత అందం చూడలేదనిపించింది. వయసు పద్దెనిమిది, పంథొమ్మిది ఏళ్ళకన్న ఎక్కువ వుండదు. ఓ మామూలు నల్లంచుచీర కట్టుకుంది. ఒంటిమీద నగలేమీ లేవు. మోకాళ్ళమీద కూర్చుని నిశ్చలమనసుతో నొసట తిలకం పెట్టించుకుంటూవుంది. బ్రాహ్మడు ఏకాగ్రచిత్తంతో ఆమెనొసట తిలకం పెడుతున్నాడు.

సత్యేంద్రుడు దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు. బ్రాహ్మడు అతన్ని బాగా ఎరుగున్నాడు. సత్యేంద్రునివల్ల అతనికి మంచి దక్షిణలు ప్రాప్తిస్తుండటం మామూలుకాబట్టి-ఆ చంద్రముఖి నుండి ధ్యానం మరల్చి, పెడుతున్న తిలకం వదలి బాబుగారి బట్టలకోసం చెయి జాపాడు.

ఇద్దరి చూపులు కలిసినై. సత్యేంద్రుడు తొందర తొందరగా బట్టలు బ్రాహ్మడిచేతి కిచ్చి గబగబా మెట్లు దిగి నీళ్ళల్లోకి వెళ్ళాడు. కాని ఇవ్వాళ ఈదటానికి మనస్కరించేక ఏదోవిధంగా స్నానమనిపించుకుని బట్టలు మార్చుకునేందుకు

పైకి వచ్చి చూచేటప్పటికి ఆ రూపసి అక్కడ లేకపోయింది.

ఆ రోజంతా సత్యేంద్రుని మనసు 'గంగా, గంగా' అని అలమటించింది. మర్నాడు తూర్పు తెల్లవారకముందే అతన్ని గంగామతల్లి ఆకర్షించింది. గబగబా దణ్ణెంమీాది తుండుగుడ్డ పైన వేసుకొని గంగానదికి బైలుదేరి వెళ్ళాడు.

రేవుకు వెళ్ళి చూచేప్పటికి—ఆ రూపసి అప్పుడే స్నానం చేసి పైకి వస్తూవుంది. సత్యేంద్రుడు గబగబా స్నానంచేసి బ్రాహ్మడివద్దకు వచ్చేప్పటికి - ఆ రూపసి నిన్నటిలాగానే నొసట తిలకం పెట్టించుకుంటూవుంది. ఇవ్వాళకూడా చూపులు కలిశాయి. ఇవ్వాళకూడా అతని శరీర మంతటా మెరుపులు పరుగులెత్తినాయి. అతను త్వరత్వరగా బట్టలు మార్చుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

## 3

ఆమె ప్రతిరోజూ ప్రొద్దున్నే స్నానానికి వస్తుం దని తెలుసుకున్నాడు సత్యేంద్రుడు. ఇంతవరకు ఇద్దరికీ సాక్షాత్కారం కాకపోవటానికి తను ఆలస్యంగా రావటమే కారణమనుకున్నాడు.

ఏటివడ్డున ఈ ఏడు రోజులనుంచీ ఎడతెగకుండా ఒకరి చూపులు ఒకరికి కలుస్తూనేవున్నాయి. కాని ఇంతవరకు ఒకరి నొకరు పన్నెత్తి పలుకరించుకునే అవకాశమే లేకపోయింది. కళ్ళతో సంభాషణ జరిగే చోట నోరు మౌనంగా ఊరుకోవటం సహజం. ఆ అపరిచితరూపసి ఎవరో తెలియదు గాని కళ్ళతో సంభాషించే శిక్షమాత్రం బాగా అభ్యసించింది.

ఆ విద్యలో ఆమెకు మంచి పాండిత్యంకూడా వుం దని సత్యేం ద్రుడు గ్రహించాడు.

ఆ రోజున అతను గంగలో స్నానంచేసి పరధ్యానంతో ఇంటికి వస్తూన్నాడు. ఇంతలో అకస్మాత్తుగా "ఒక మాట వింటారా ?" అన్న పిలుపు వినపడింది. తలెత్తి చూచేప్పటికి ఆ రూపసి రైల్వేలైనుపక్కగా నుంచుని వుంది. ఆమె ఎడమ చంకను ఒక చిన్ననీళ్ళబిందె, కుడిభుజంమీద తడిచీరలు వున్నాయి. ఆమె తలతో సైగచేసి పిలిచింది. సత్యేంద్రు డటూ యిటూ చూచి ఆమెదగ్గరకు వచ్చి నుంచున్నాడు. ఆమె ఉత్సుకనేత్రాలలో అతని మొహంవంక చూచి మృదువుగా "ఇవ్వాళ మా పనిమనిషి రాలేదు, దయయుంచి మీరు నన్ను కొంచెందూరం పంపిస్తే మీ మేలు మరువలేను" అన్నది. ఎప్పుడూ ఆమె ఒక దాసీని వెంటబెట్టుకు వస్తుం దనీ ఇవ్వాళ ఒంటరిగా వచ్చిం దనీ అనుకున్నాడు సత్యేంద్రుడు. నోటితో కా దనలేకపోయాడు. ఇది గ్రహించి ఆ రూపసి ఒక చిగు నవ్వు నవ్వింది. ఆ నవ్వుకు ఆమె అడుగులకు మడుగు లొత్తని వా రెవరూ? సత్యేంద్రుడు "పదండి" అని ఆమెవెంట బైలు దేరాడు. నాలుగైదుఅడుగులు నడిచాక "మా దాసీదానికి జబ్బుగా వుండటంమూలాన రాలేదు. నేను గంగాస్నానం చేయందే వుండలేను. మీకూడా ఈ చెడుఅలవాటు బాగా అలవడిం దనుకుంటాను" అన్నది.

"అవును, నేనుకూడా తరచు గంగాస్నానానికి వస్తూ వుంటాను" అన్నాడు సత్యేంద్రుడు.

"ఇక్కడ మీరు ఏ వీథిలో వుంటున్నారు?"

"చోర్‌బాగ్‌లో వుంటున్నాము"

"మాయిల్లు 'జోడాపంకూ'లో వుంది. మీరు నన్ను పథరియా ఘాట్ మలుపువరకు పంపించండి. అక్కడినుంచి పెద్దబజారునే బడి వెళ్ళిపోతాను."

"అయితే, మంచిదే."

మళ్ళా చాలసేపటివరకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కొంతదూరం వచ్చినతర్వాత ఆమెపని కొంచెం ఆగి చిరునవ్వుతో "చాలు, ఇక మీరు వెళ్ళవచ్చు. మాయిల్లు ఇక్కడకు దగ్గరే. నమస్కారం" అన్నది.

సత్యేంద్రుడు ప్రతినమస్కారంచేసి తలవంచుకొని గబగబా వెళ్ళిపోయాడు. ఆరోజు అతని మనస్థితి వ్రాయటం చాల కష్టం. కాని యౌవనావస్థలో పంచశరుని ప్రథమాఘాతాన్ని తట్టుకున్నవారికి బాగా తెలుస్తుంది. ఉన్మాదంలో మత్తెక్కినవారికి భూమ్యాకాశాలన్నీ పచ్చగా కనపడినట్లు చైతన్యశూన్యమైన అతని మనసంతా ఆ వైపుకే లాగసాగింది.

సత్యేంద్రుడు మర్నాడు ప్రొద్దున్నే లేచి చూచేప్పటికి చాల ప్రొద్దెక్కింది. ఒకవిధమైన వ్యధాతరంగం అతని హృదయాన్నంతా బాధించసాగింది. ఈ రోజంతా వ్యర్థమైందనుకున్నాడు. నౌకరు ముందుగా పోతున్నాడు. అతన్ని దగ్గరకు పిలచి గద్దించుతూ "ఇంత ప్రొద్దెక్కినా లేపలేదేమిరా వెధవా! నీకొకరూపాయి జరిమానా వేశానుపో" అన్నాడు.

పాప మా నౌకరుకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయి కళ్ళప్పళించుకొని చూస్తూ నుంచున్నాడు. ఆ కోపంతో తుండుగుడ్డ తీసుకోకుండానే గబగబా బైటికివచ్చి బాడి బండొకటి మాట్లాడుకుని పథరియాఘాటుకు పోనివ్వమని దా వెంట కళ్ళు పరుచుకొని కూర్చున్నాడు. నదికి వెళ్ళినతర్వా

రేవుదగ్గర ఆమె కనపడగానే అతని క్షోభంతా ఎగిరిపోయింది. దారిలో ఒక అమూల్యరత్నం దొరికిందా అనిపించింది.

అతను బండి దిగగానే ఆ రూపసి చిరపరిచితురాలు లాగ చిరునవ్వుతో "ఇవ్వాళ ఇంత ఆలస్యంచేశారేం? నేను అరగంటనుంచి ఇక్కడ నుంచునివున్నాను. త్వరగా స్నానం చెయ్యండి. ఇవ్వాళకూడా రాలేదు మా దాసీది" అన్నది.

"ఒక్కనిమిషం ఆగండి?" అని సత్యేంద్రుడు గబగబా నీళ్ళలో దిగాడు. అతని ఈత ఏమైందో ఏమో, రెండు మునకలు మునిగి ఒడ్డుకువచ్చి "బండిఏమైంది" అన్నాడు.

"నేను బాడుగ యిచ్చి పంపించాను" అన్నదిరూపసి.

"బాడుగ మీా రిచ్చారా?"

"పరవాలేదు, పదండి" అని ఆమె మళ్ళా ఆ మనోమోహిని నవ్వుతో బైలుదేరింది.

సత్యేంద్రుడు మనసారా యిచ్చి కూర్చున్నాడు. లేక పోతే ఇదంతా ఏమిటా అని అతనికి సందేహం కలిగేది.

దారివెంట నడుస్తూ "మీా ఇల్లు ఎక్కడని చెప్పారూ? చోర్ బాగ్‌లోనా?" అన్నది రూపసి.

"అవును"

"అక్కడ వుండేదంతా దొంగ లేనా ఏమిటి?"

సత్యేంద్రుడు ఆశ్చర్యంతో "ఎందుకని?" అన్నాడు.

"మీారు దొంగల రాజయ్యారు గనుక!" అని రూపసి క్రీగంటితో సత్యేంద్రునికేసి చూచి, చిరునవ్వు లొలకబోసుకుంటూ చంకను బిందెపెట్టి హంసగమనంతో నడువసాగింది. ఇవ్వాళ ఆమెచంకనున్న బిందె కొంచెం పెద్దదిగా వుంది. బిందెలో కదలాడుతున్న గంగాజలం కలకలనాదంతో "ఓరి

విభ్రాంతుడా ! గుడ్డియువకుడా ! ఇదంతా మోసం ! కపటం ! జాగ్రత్త !" అని వ్యంగ్యంగానూ, తిరస్కారంగానూ అన్నట్లు విన్పించుతూవుంది.

మలుపు దగ్గరకు వచ్చిన తర్వాత సత్యేంద్రుడు సంకోచంతో "బండిబాడుగ......... ?" అన్నాడు.

రూపసి వెనక్కి తిరిగి నుంచుని అస్ఫుటస్వరంతో "ఒక విధంగా అది వీరా రిచ్చినట్లేగా !" అన్నది.

సత్యేంద్రుడు ఈ సైగను గ్రహించలేక" నేను ఇచ్చినట్లు ఎలా ?" అన్నాడు.

"నాదగ్గర ఇంకా నా దనేది ఏముంది నే నివ్వటానికి ? ఉన్నదికాస్తా నువ్వు మొదలే దోపిడీచేసి, దొంగతనం చేసి తీసుకున్నావు" అని చటుక్కున మొహం తిప్పుకుని నవ్వును కప్పిపుచ్చుకుంది.

ఈ అభినయం సత్యేంద్రుడు చూడలేదు. అందుచేత ఈ దొంగతనపు ప్రచ్ఛన్నసంకేతం విద్యుత్ రేఖలాగ అతని సంశయజాలాన్ని విస్తీర్ణపరుస్తూ హృదయాంతరాళం వరకు ప్రవేశించింది. ఈ నడిబజారులోనే ఆమె పాదాలమీద పడాలనిపించింది. కాని తక్షణమే సిగ్గుతో తల వంగిపోయింది. మళ్లా తలెత్తి రూపసి మొహం చూడలేక మెదలకుండా సాగిపోయాడు.

రూపసి చెప్పివచ్చిందో ఏమో దాసీది కాలిదారిమీద నుంచుని అంతాచూస్తూ వుంది. అతను వెళ్లిపోయిన తర్వాత దగ్గరకు వచ్చి "పాప మాయన్ని అలా నాటక మాడిస్తున్నావెందుకు ? నాలుగు రాళ్లు రాలేదా ?"

రూపసి నవ్వుతూ "ఆ సంగతి తెలియదు. కాని

ఇలాంటి మూర్ఖుల ముక్కుకు తాడుబోసి గానగ తిప్పించటమంటే నాకు చాల సరదా" అన్నది.

దాసీది కొంచెంసేపు పకపక నవ్వి "నీకు అదికూడా చేతవునా? నువ్వు ఏమైనా అను. చూట్టానికి ఎవరో జమీందారు బిడ్డలాగున్నాడు. ఆ మొహం, ఆ ముక్కూ — మీ యిద్దరికీ చక్కగా జోడు కలిసింది. మీరిద్దరూ నుంచుని మాట్లాడుతూవుంటే జంటగులాబీలు వికసించినాయో అనిపించింది" అన్నది.

రూపసి చిరునవ్వుతో "సరే పద. అంతగా నచ్చితే ఆ గులాబీ పువ్వును నువ్వే పెట్టుకో" అన్నది.

దాసీది ఒక పట్టున వదిలిపెట్టే మనిషికాదు. "ఎందుకమ్మా అంతకోపం! నేను బ్రతికివుండగా నీ వస్తువనేది ఏదీ ఇంకెవరికీ యివ్వను.... నాకాసంగతి బాగా తెలుసు" అన్నది.

౪

కళ్ళారా చూచినా అసంభవవిషయాలను ఎవరితోనూ చెప్పవద్దని జ్ఞానుల వుద్దేశం. కారణం — అజ్ఞానులు దానిని నమ్మరుకనుక. పాపం ఈ అపరాధం వల్లనే శ్రీమంత్ జైలుకు వెళ్ళవలసివచ్చింది.

ఏది యెలావున్నా సత్యేంద్రుడు ఆరోజున ఇంటికివచ్చి టెనిసన్ కవిత్వం చదివి డాన్ జాన్ ను తెలుగులో అనువాదం చేయటానికి కూర్చున్న మాటమాత్రం యథార్థం.

అతనింత పెద్దవాడై నాకూడా ఈ కలకత్తా పట్నపు వీథుల్లో, రేవులవద్ద రాత్రింపగళ్లు ఎంత వింతైన ప్రేమవరదలు

వస్తున్నారో, దాని కెరటాలలో మునిగిపోవటం ఎంతవరకు నిరపరాధమో - అతని కేమీ అర్థంకాలేదు.

రెండుమూడురోజులతర్వాత అలాగే స్నానంచేసి ఇద్దరూ ఇంటికి తిరిగి వస్తూండగా దారిలో "రాత్రి నేను థియేటరుకు వెళ్ళాను. పాపం 'సరళ' దుఃఖం చూచి గుండె పగిలిపోయింది" అన్నది రూపసి తలవనితలంపుగా.

సత్యేంద్రుడు సరళనాటకం చదవలేదుగాని, స్వర్ణలత అనుపుస్తకం చదివాడు. అందుచేత అతను ధైర్యంగా "అవును, పాపం చాలకష్టాలతో చనిపోయింది!" అన్నాడు.

ఆమె ఒక నిట్టూర్పు విడచి "అబ్బ! ఆమెకు ఎటువంటి కష్టాలు కలిగినాయి. సరళ తన భర్తను ఎందుకంత అమితంగా ప్రేమించేదో? మొదటిభార్య ఎందుకు ప్రేమించలేకపోయిందో మీరు చెప్పగలరా?" అన్నది.

సత్యేంద్రుడు క్లుప్తంగా" వాళ్ల వాళ్ల స్వభావం" అన్నాడు.

"అవును. అదే! పెళ్లనేది అందరూ చేసుకుంటారు. కాని పెళ్లిచేసుకునే ఈ స్త్రీపురుషులందరూ ఒకరినొకరు సమానమైన ప్రేమతో చూచుకో గలుగుతున్నారా? సుఖాన్ని అనుభవించ గలుగుతున్నారా? మరణకాలం వరకూ కూడా ప్రేమంటే ఏమిటో తెలియనివారు అనేకమంది వున్నారు. ఎదురుగా ఎంత సంగీతవాయిద్యాలు వినపడుతున్నా సరే చెవి యొగ్గనివారు అనేకమంది వున్నారు. కొంతమంది దేనికీ కోపగించుకోరు. అసలు కోపగించుకోనే లేరు; లోకులు వారిని పొగుడుతూ, గౌరవిస్తూ వుంటారు. కాని నా మనసు వారందరినీ నిందించాలంటుంది"

సత్యేంద్రుడు చిరునవ్వుతో "ఎందుకని ?" అన్నాడు.

రూపసి ఉద్దీప్త కంఠంతో వారు ఓర్పులేనివారు, అసమర్థులు కాబట్టి. కొద్దో గొప్పో గుణాలున్నా స[illegible] సవితిలో దోషాలే ఎక్కువ వున్నాయి. ఆమె అంతఅత్యాచారానికి ఒడిగట్టినా సరళకు కోపం రాలేదు" అన్నది.

సత్యేంద్రుడు మాట్లాడలేదు.

"అతని పెద్దభార్య ప్రమద ఎంతరాక్షసి అనుకున్నారు. నే నుంటే గొంతు పిసికేసేదాన్ని" అని మొదలు పెట్టింది.

సత్యేంద్రుడు నవ్వుతూ "నువ్వేలావుంటావు? ప్రమద అనే పేరుగల స్త్రీ నిజంగా ఎవరూ లేరు. అదంతా కవికల్పన మాత్రమే" అన్నాడు.

రూపసి ఒక పెద్దనిట్టూర్పు విడచి "అయితే, కవి అలాంటి కల్పన ఎందుకు చేయాలి? మానవులందరి అంతఃకరణంలో భగవంతుడున్నాడు, ఆత్మ వున్నది అంటారు. కాని ప్రమద చరిత్ర చూస్తూవుంటే ఆమె అంతఃకరణంలో భగవంతుడుగానీ, ఆత్మగానీ వున్నట్లు కనపడదే. పెద్దపెద్ద వాళ్ళ పుస్తకాలు చదవటం, ఆశలు పెంచుకోటానికి గాని, ప్రేమను పెంపొందించుకోటానికా ఏమిటి? పుస్తకాలు చదువగానే మనిషిలో ఈర్ష్యా, ద్వేషమూ పుట్టుకొస్తాయి. మానవునిలో ఆత్మాలేదు, అంతర్యామీ లేదని ఒకపుస్తకంకూడా రాశాను" అన్నది.

సత్యేంద్రుడు ఆశ్చర్యంతో ఆమె మొహం కేసి చూస్తూ "మీరు చాలపుస్తకాలు చదివినట్లుందే!" అన్నాడు.

"ఇంగ్లీషు తెలియనే తెలియదు. తెలుగులోవచ్చిన పుస్తకాలలో దాదాపు అన్నీచదివాను. ఒక్కొక్కనాడు రాత్రి

తెల్లవార్లూ చదువుతూవుంటాను. ఇదేగా పెద్దబజారు. ఒక సారి మాయింటికి రండి. నా దగ్గరవున్న పుస్తకాలన్నీ చూచి పోదురుగాని" అన్నది రూపసి.

సత్యేంద్రుడు త్రుళ్ళిపడి "మీ ఇంటికా..."అన్నాడు.

"అవును, మా ఇంటికే. పద! రాకతప్పదు."

సత్యేంద్రుని మొహం ఒక్కసారి వెలవెల బోయింది. అతను భయపడుతూ "కాదు,...కాదు...ఛీ! ఛీ!"అన్నాడు.

"ఛీ! ఛీ! ఏమీలేదు పద!"

"వద్దు, వద్దు. ఇప్పుడుకాదు, ఇవ్వాల్టికిపోనీ!" అని సత్యేంద్రుడు తడబడుతూన్న అడుగులతో తొందరగా వెళ్ళిపోయాడు. ఇవ్వాళ అతనిహృదయం ఆ అపరిచితరూపసి యందు కలిగిన ప్రేమభారంతో కృంగిపోసాగింది.

౨

ఉదయాన్నే గంగలో స్నానంచేసి ఇంటికి వచ్చాడు. మనసులో చాలా విచారంగా వున్నది. అతని కంటితడి ఇంకా ఆరలేదు. తన సౌందర్యరాశి యిప్పటికి నాలుగురోజులనుంచీ గంగాస్నానానికి రావటంలేదు. ఈ నాలుగు రోజులనుంచీ అతను ఆకాశపాతాళవిషయాలు ఎన్ని ఆలోచించాడో అంతు లేదు. అప్పుడప్పుడు అతనికి – ఆమె మరణించిందో, మరణ శయ్యమీద వున్నదో అన్న దుశ్చింత కలిగేది.

అతనికి ఆమెవుండే వీథిమాత్రం తెలుసు. ఏ యిల్లో యేమో తెలియదు. తలుచుకుంటే హృదయం దగ్ధమై పోతోంది. ఆమె వెంటవెళ్ళి ఆరోజునే యిల్లు ఎందుకు చూచి

రాలేదా? ఆమె కోర్కె నెందుకు వుపేక్షించానా? అని పశ్చాత్తాపపడసాగాడు.

అతనికి ఆమెయందు యథార్థంగా ప్రేమ కలిగింది. అది దృష్టిదోషంకాదు. హృదయజనితమైన ప్రేమపిపాస. దానిలో మోసానికిగానీ, అన్యాయానికిగానీ స్థానంలేదు. అదే యథార్థమైన పవిత్రప్రేమ!

"బాబుగారూ!"

సత్యేంద్రుడు త్రుళ్ళిపడి తిరిగి చూచాడు. ఆమె వెంట రోజూవచ్చే దాసీది నుంచుని వుంది.

సత్యేంద్రుడు కొంచెం ఆతురతతో ఆమెదగ్గరకు వెళ్ళి విచారంగా ఆమె ఏమైంది?" అని ఏడ్చాడు.

దాసీది నవ్వాపుకొని తలవంచుకునే "ఆమెఒంట్లో బాగుండలేదు. మిమ్మల్ని చూడాలని ఆతురత పడుతూ వుంది" అన్నది.

"సరే, పద!"

అని కళ్ళు తుడుచుకొని - ఆమెవెనుక కొంచెందూరం వెళ్ళాక "జబ్బేమిటి? ఇప్పుడేమైనా ఎక్కువైందా?" అని అడిగాడు.

"పెద్దజబ్బేమీ లేదు. కాని జ్వరంమాత్రం కొంచెం ఎక్కువగా వుంది" అన్నది దాసీ.

సత్యేంద్రుడు మనసులో భగవంతుణ్ణి ప్రార్థించాడు. దాసీదాన్ని ఇంకేం అడగలేదు. ఇంటిముందుకువెళ్ళి చూచేప్పటికి ఇల్లు చాల పెద్దదిగా కనపడింది. వాకిట్లో ఒకకావలివాడు కూర్చొని పాటలు పాడుతూ కూర్చున్నాడు. "నేను వస్తే ఆమె

తండ్రికి కోపంరాదుగదా? ఆయన నన్నేరగడు" అన్నాడు దాసీదానితో.

"ఆమెకు తండ్రిలేడు గాని తల్లివుంది. ఆమెతల్లికూడా ఆమెలాగానే మిమ్మల్ని అమితంగా ప్రేమిస్తుంది" అన్నది దాసీ.

సత్యేంద్రుడు మళ్ళీ మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్లాడు. పైకి వెళ్ళి చూచేటప్పటికి ఒక గది అలంకరించబడి ఉంది. దానిలో నుంచి కిలకిల నవ్వులు, గలగల గజ్జెల మోతలు, డమడమ తబలా పలుకులు వినబడుతున్నాయి. దాసీ ఆ గదిని చూపించి, "అదే గది...లోపలికి పదండి" అని వాకిటి పరదా తొలగించి "ఇదుగోనమ్మా! మీ ప్రియుడు" అన్నది.

గది లోనికి చూచేటప్పటికి అతని తల గిర్రున తిరిగి పోయింది. స్పృహతప్పి పడిపోతా డేమో ననిపించింది. ఎలానో తమాయించుకొని గుమ్మం పట్టుకొని చతికిల పడిపోయాడు.

ఆ గదిలో బల్లమీద పరుపులు పరచి వున్నాయి. దాని మీద ముగ్గురు పెద్దమనుష్యులు కూర్చుని వున్నారు. వారిలో ఒకడు తబలా, ఒకడు హార్మోనియం ముందు పెట్టు కొని వున్నారు. మూడవ వాడు తాగుతున్నాడు. ఇదంతా చూస్తే ఆమె నాట్యం చేస్తూవుందా అనిపిస్తూవుంది. ఒంటి నిండా నగలు, కాళ్ళకు గజ్జెలు, కళ్ళకు సుర్మా వున్నాయి. ఆమె గలగల గజ్జెలతో వచ్చి సత్యేంద్రుని చేయి పట్టుకొని "పిచ్చిముండా! ఇటు చూడు, ఇక నీ ఎగతాళి వేళాకోళాలు పనికిరావు. అవంటే నాకు అమిత భయం" అన్నది.

ఎలక్ట్రిక్ షాక్‌లాగ ఆమె కరస్పర్శ తగలగానే సత్యేం ద్రుడు కంపించిపోయాడు.

"నా పేరు శ్రీమతి బిజలీ. మరి నీ పే రేమిటి చెలి కాడా...... సుద్దా? మొద్దా?" అన్నది రూపసి

అందరూ పక్కుమని నవ్వారు. ఆ దాసీది నవ్వుతూ కిందే పడిపోయి "బలేదాని వమ్మా! రంగంలోకి తీసుకురావటం నీకు బాగా తెలుసు" అన్నది.

బిజలి కొంచెం కోపం తెచ్చిపెట్టుకుని "నోరుముయ్యి. ఆట్టే యిదిగా వాగకు" అని, సత్యేంద్రునితో "రాండి, ఇక్కడకు వచ్చి కూచోండి" అని సత్యేంద్రుణ్ణి లాక్కొచ్చి బలవంతాగా ఒక కుర్చీమీద కూచోబెట్టింది.

సారాయి తాగుతున్న మనిషి లేచివచ్చి సత్యేంద్రుని పాదాలకు సాష్టాంగప్రణామంచేసి యేడుస్తూ "నేను మహా పాతకుణ్ణి బాబూ! నాకు కొంచెం మీ పాదధూళి......" అన్నాడు.

హార్మోనియమ్ వాయిస్తున్న వ్యక్తి కొంచెం తెలివిలో ఉన్నాడు. "పాపం, అతన్నెందు కలా అనవసరంగా తమాషా పట్టిస్తారు" అని సానుభూతి చూపించాడు.

బిజలి నవ్వుతూ "భలే! అనవసర మేముంది! నిజంగా తమాషాకనుకనే ఇవ్వాళ మీ అందరిముందూ ఇతన్ని తీసుకొచ్చి తమాషా చూపిస్తున్నాను. అయితే 'మొద్దూ' నామీద ఒట్టువేసుకొని న న్నేమనుకున్నావో నిజం చెప్పు? నేను ప్రతిరోజు గంగాస్నానం చేస్తూవుంటాను. కానీ బ్రాహ్మణ స్త్రీనిగానీ, ముస్లిమ్‌పడుచునుగానీ, క్రిష్టియన్ కన్యనుగానీ గాను. ఇంత వయసువచ్చిన హిందూ యువతిని చూచి నన్ను విధవనో సధవనో అనుకొనివుంటావు. అయితే, ఏమనుకొని నా ప్రేమకోసం తిరిగావో చెప్పు? నన్ను పెండ్లిచేసుకోవా

లనుకున్నావా ?... ...లేకపోతే మోసపుచ్చి న న్నెక్కడి కైనా లేపుకుపోదా మనుకున్నావా ?" అన్నది.

మళ్ళా అంతా ఫక్కున నవ్వారు. కాని సత్యేంద్రుడు తలెత్తలేదు— మనసులో ఏమి ఆలోచించుకుంటున్నాడో? ఈ సంగతి ఎలా చెబుతాడో? చెప్పినా నమ్మే దెవరూ — సరే, ఆ సంగతి అంతటితో పోనీ.

బిజలి చకితురాలై "అయ్యో నా మందమరపు తగ లెయ్యా! ఓ శ్యామా! త్వరగా వెళ్ళి బాబుగారికి ఫలహారం తీసుకురా! పాపం స్నానంచేసి వచ్చారు. ఇంతసేపటినుంచీ నేను పరిహాస మాడుతూ కూర్చున్నాను" అన్నది.

కొంచెంసేపట్లో దాసీది ఫలహారం తీసుకొచ్చింది. బిజలి దాన్ని తనచేతిలోకి తీసుకొని సత్యేంద్రుని పాదాలవద్ద మోకరించి కూర్చుని "కొంచెం తల పైకెత్తి, ఇదిగో తీసుకొని తినండి" అన్నది.

ఇంతసేపటినుంచీ సత్యేంద్రుడు తన శక్తినంతటినీ కేంద్రీకరించి తమాయించుకుంటూ వచ్చాడు. ఇక తమాయించుకో లేక తలపైకెత్తి మెల్లగా "నేను తినను" అన్నాడు.

"ఎందుకని? కులభ్రష్టమైపోతుందా? నే నేమైనా మాలదాన్నా? మాదిగదాన్నా?"

"మీరు ఆ జాతివారైతే నాకు తినటానికి అభ్యంతర ముండేదికాదు. మీ రెవరో కాని వారు" అన్నాడు సత్యేంద్రుడు ప్రశాంతంగా.

బిజలి కిలకిల నవ్వుతూ "మొద్దుబాబుకిగూడా నాకు తిప్పటం చేతకానట్లుంది" అన్నది.

"నా పేరు సత్యేంద్రుడుకాని మొద్దు కాదు. నే నేం

బాకులు దూయటం నేర్చుకోలేదు. కాని పొరపాటని తెలిసినమీదట దాన్ని దిద్దుకోటంమాత్రం నేర్చుకున్నాను" అన్నాడు సత్యేంద్రుడు.

బిజలి ఇంకేదేదో అనాలనుకున్నదికాని అనలేక చివరికి "అయితే, నేను ముట్టుకున్నది తినవా ఏమిటి" అన్నది.

"తినను"

బిజలి లేచి నుంచున్నది. ఈ సారి ఆమె కుపితస్వరంలో కొంచెం తీవ్రత హెచ్చి కఠినంగా "నువ్వు తినకతప్ప దని నేను గట్టిగా చెబుతున్నాను. ఇవ్వాళ కాకపోతే రేపో, రేపు కాకపోతే ఎల్లుండో తినకతప్పదు" అన్నది.

సత్యేంద్రుడు తలకాయతిప్పి "ఇదిగో చూడండి, పొరపాట్లనేవి అందరికీ జరుగుతూవుంటాయి. కాని నాది ఎంత పొరపాటో గ్రహించారా? కాని మీరుకూడా చాల పొరపడుతున్నారు. ఇవ్వాళ కాదుగదా, రేపు కాదుగదా, ఇంకా నాలుగు రోజు లున్నా తినను. ఈ జన్మలోనే కాదు, ముందు జన్మలోకూడా నువ్వు ముట్టుకున్నది తినను. నాకు సెలవు ఇవ్వండి. నేను ఇక వెళ్ళిపోతాను. మీ నిట్టూర్పులతో నా రక్తం శుష్కించిపోతూవుంది" అన్నాడు.

ఆమె మొహంమీద ఒక విధమైన ఈర్ష్యాఛాయ ఆవరించింది. "ఇతను 'అరసికేషు రహస్యవినోదమ్' అని. "పోనీ బిజలీ! ఈ పూట ఆనందాన్నంతా మంటకలిపాడు" అన్నాడు ఒకడు.

బిజలి మెదలకుండా సత్యేంద్రుని మొహంకేసి చూస్తూ నుంచున్నది. ఇంత వినయవిధేయతలు గలవా — ఇలా మాట్లాడతా డని ఆమె ఎప్పుడూ వూహించలేదు.

సత్యేంద్రుడు లేచి నుంచునేప్పటికి బిజలి కోమల స్వరంతో "ఇం కొంచెంసేపు కూర్చోండి" అన్నది.

"ముక్కుతాడు కొంచెం సందొదులు అమ్మా!" అన్నాడు ఒక త్రాగుబోతు.

సత్యేంద్రుడు గదిలోంచి బైటికి వచ్చాడు. బిజలి గబ గబ ముందుకు వచ్చి వాకిటికి అడ్డంగా నుంచుని "వాళ్ళు చూస్తా రని వెనకాడానుగాని లేకపోతే అప్పుడే చేతులు జోడించి నావల్ల చాల అపరాధం జరిగిం దని మిమ్మల్ని వేడు కునేదాన్ని" అన్నది.

సత్యేంద్రు డేమీ సమాధాన మివ్వకుండా మొహం తిప్పుకున్నాడు.

"ఈ సారికి నన్ను క్షమించండి. ఆ ఎదురుగా వున్న గదిలోనే నా పుస్తకా లున్నాయి. ఒకసారి వచ్చి చూచి పొండి" అన్నది రూపసి మళ్ళా.

"చూడనవసరం లేదు" అని సత్యేంద్రుడు మెట్లవైపుకు సాగాడు. బిజలి అతనివెనుక నడుస్తూ "రేపు మళ్ళా కనపడ తారా ?" అన్నది.

"కనపడను"

"ఇం కెన్నటికీ కనపడరా ?"

"లేదు"

దుఃఖంతో బిజలీగొంతు నిండుకొచ్చింది. ఆమె గుటక మింగి సరిజేసుకొని "కనపడ రంటే నాకు నమ్మకం కలగటం లేదు. కనపడకపోతేమానే. నా ఒక్కమాటయందు నమ్మక ముంచుతారా ?" అన్నది.

ఆమె భగ్నస్వరం చూచి సత్యేంద్రుడు ఆశ్చర్య

పడ్డాడు. కాని ఈ పదిహేనురోజులనుంచీ చూస్తున్న నాటకం ముందు ఇ దేమీ కా దనిపించింది. అయినా అతను వెనక్కి తిరిగి నుంచున్నాడు. బిజలి అతని మొహంలోకి గాఢంగా చూచింది. కాని దానిలో విశ్వాసచిహ్న లున్నట్టు ఎక్కడా క నిపించలేదు. కాని ఇంకా చేసే దే ముంది?

"నమ్మేది ఏం మాట?" అన్నాడు సత్యేంద్రుడు.

బిజలి నోరు మెదల్చిందికాని మాట పెదవులు దాటి పైకి రాలేదు. కన్నీటికళ్ళను ఒకసారి తెరచి మళ్ళా మూసుకుంది. సత్యేంద్రుడు తలెత్తి ఇది చూచాడు. కన్నీళ్ళలో కూడా కపట ముంటుందా? బిజలి తలెత్తకుండానే సత్యేంద్రుడు తన్ను పరీక్షిస్తున్నా డని గ్రహించింది. కాని నోటిలోంచి మాట బైటికి రాలేదు.

ఆమె అతన్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తూవుంది. ఆ ప్రేమకణాల్లో ఒక్కటైనా సార్థకపరచుకోవా లన్న లాలసతో తన రూపరాశిని, శరీరాన్ని అవసరమైతే ప్రాణాల్నికూడా త్యాగంచెయ్యటానికి సిద్ధంగా వుంది. కాని దానిని నమ్మేది ఎవరు? జడ్జిఎదట వెయ్యి నేరాలు మొహాన పెట్టుకు నుంచుని, నా వృత్తి నేరాలుచేయటమే అయినా నే నీసారి నిర్దోషురాల నని నోటితో అంటుంది? ఆలస్య మైనకొద్దీ జడ్జీ తనకు మరణశిక్ష విధిస్తాడేమో నని అనుమానపడసాగింది. సత్యేంద్రుడు పరధ్యానంతో "నేను ఇక వెళతాను" అన్నాడు.

బిజలి తలెత్తలేకపోయింది. కాని ఈ సారి ఆమె నోట్లోంచి మాట వచ్చింది. "వెళ్ళండి. నేను నమ్మాల నన్న విషయాన్ని మీరు నమ్మకుండా అపరాధి కాకండి. ప్రతివాని

శరీరంలోనూ ఈశ్వరు డున్నాడు. మరణానంతరంవరకు అతను దాన్ని వదలిపోలేడు” అన్నది.

కొంచెంసేపు మెదలకుండావుండి “అన్ని దేవాలయాల లోనూ ఈశ్వరపూజ జరగనిమాట నిజమే. దానిలో వుండే వారు ఈశ్వరులూ కాదు. వారిని చూచి తలవంచకపోయినా కాలదన్నిమాత్రం వెళ్ళలేవు” అని, కాళ్ళచప్పుడు విని తలెత్తి చూచేప్పటికి సత్యేంద్రుడు మెల్లగా నడిచిపోతున్నాడు.

స్వభావానికి వ్యతిరేకంగా విద్రోహం చేయవచ్చును గాని దానిని సంపూర్తిగా ఎగరగొట్టలేము. నా శరీరంమీద అనేక అత్యాచారాలు చేయవచ్చునుగాని నారీత్వాన్ని మాత్రం నాశనంచేయలేము. బిజలి నర్తకియైనా నారియేగా! జీవితంలో అనేక వడుదుడుకులు చేయుటంవల్ల అపరాధిని యైనా ఆమె శరీరము నా శరీరమేగా! కొంచెంసే పున్న తర్వాత ఆమె గదిలోకి తిరిగి వచ్చేప్పటికి మృతప్రాయ మైన ఆమె నారీప్రకృతి యేఅమృతస్పర్శతోనో మేల్కొన్నది. ఈ కాసే పట్లో ఆమెకు కలిగిన మార్పును ఆ త్రాగుబోతులుకూడా గ్రహించారు. “నీ కళ్లు ఎర్రగా వున్నాయేం బిజలీ! వా డెంత పిచ్చిఖుండాకొడుకు? ఇలాంటి అమూల్యవస్తువులను కూడా నోట పెట్టకుండా పోయాడు. సరే, ఇటు తెండి...” అని స్వయంగా పళ్ళెం లాక్కుని తినసాగాడు.

కాని ఆ మాటల్లో ఒక్కటికూడా బిజలిచెవిని పడలేదు. అకస్మాత్తుగా ఆమె దృష్టి పాదాలమీద పడింది. కాళ్ళకు కట్టుకున్న గజ్జెలు ఇంకా అలాగే వున్నాయి. అవి పాములు జెర్రులులాగ బాధించసాగినై. వెంటనే ఆమె వాటిని విప్పి పారేసింది.

"గజ్జెలు విప్పివేశారేం ?" ఒకడు అడిగాడు.

బిజలీ తలెత్తి చూచి చిరునవ్వుతో "అవును, ఇక నేను వీటిని కట్టుకోను" అన్నది.

"కట్టుకోనంటే ... ?"

"వదిలిపెట్టటమే."

ఫలహారం తింటున్న రసికుడు "ఏం రోగం వచ్చింది?" అన్నాడు.

బిజలీకి నవ్వు వచ్చింది. "ఏ రోగంవల్లయితే వెలుగు వచ్చేప్పటికి చీకటీ, సూర్యుడు వచ్చేప్పటికి రాత్రి నశిస్తుందో ఆ రోగంతోనే మీ బిజలి ఇవ్వాళ చిరమృతి నందింది" అన్నది నవ్వుతూనే.

౬

ఆ తర్వాత నాలుగేళ్ళనాటి సంగతి. కలకత్తాలో ఒక పెద్దభవంతిలో జమీందారుకొడుకు అన్నప్రాశనం. భోజనాదు లన్నీ పూర్తయినాయి. సాయంత్రం మేజువాణీకి వాకిట ముందు పందిట్లో ఏర్పాట్లు జరుగుతున్నాయి. రకరకాలైన అభినయాలు, నృత్యాలు, పాటకచేరీలు జరుగుతాయి.

నలుగు రైదుగురు నాట్యకత్తెలు పందిట్లో ఒకపక్కని కూర్చునివున్నారు. మేజువాణీ చేసేది వీరే. భవంతి పై అంతస్తు వరండాలో పరదాచాటున రాధారాణి ఒక్కత్తే కూర్చుని నర్తకులను చూస్తూవుంది. ఆహ్వానింపబడిన స్త్రీలు ఇంకా రాలేదు.

సత్యేంద్రుడు వెనకనుంచి నిశ్శబ్దంగా వచ్చి "ఇంత ధ్యానంతో చూస్తున్నా వేమిటి ?" అన్నాడు మెల్లగా.

రాధారాణి భర్తమొహంకేసి చూచినవ్వుతూ "ఏమీ లేదు! ఆ నర్తకి ఎలా అలంకరించుకుందో చూస్తున్నాను. తలవని తలంపుగా ఇలా వచ్చారేం?" అన్నది.

పతి నవ్వు మొహంతో "పాపం నువ్వు ఒంటరిగా కూర్చున్నావు, కొంచెం చూచిపోదా మని వచ్చాను" అన్నాడు.

"చాల్లే, పో!"

"నిజంగా...! అయితే, వారిలో నీ కెవరు అందంగా వున్నారో చెప్పు?"

రాధారాణి వ్రేలితో మామూలువస్తులతో నున్న ఓ నర్తకిని చూపించి 'ఆమె' అన్నది.

"ఆమె చాల బలహీనమైనది; రోగగ్రస్తురాలు" అన్నాడు సత్యేంద్రుడు.

"అయినా ఆమే అందరికంటే అందంగావుంది. కాని పాపం పేదరాలుగా కనపడతూవుంది. తక్కినవారిలా ఒంటి మీద నగ లేమీ లేవు."

"అయివుండవచ్చు. కాని వీరికి వా రెంత డబ్బు యివ్వాలో తెలుసా?"

"తెలియదు."

సత్యేంద్రుడు ఒక్కొక్కరినే వేలితో చూపిస్తూ "వారిద్దరికీ ముప్పయ్యేసి రూపాయ లివ్వాలి. ఆమెకు ఏభై యివ్వాలి. నువ్వు పేదరా లని అంటున్న ఆవిడ రెండువందల రూపాయలు పుచ్చుకుంటుంది" అన్నాడు.

రాధారాణి ఆశ్చర్యంతో "రెండువందల రూపాయలా! బాగా పాడుతుందా ఏమిటి?" అన్నది.

"ఇప్పుడు ఎలా పాడుతుందో తెలియదుగాని, నాలుగే ళ్ళక్రితం బాగాపాడే దని అందరూ అనుకుంటూ వుంటారు."

"ఇంత డబ్బిచ్చి తీసుకొచ్చింది ఎందుకు?"

"అంతకన్న తక్కువకు ఆమెరాదు. అంతకు కూడా చాలాకష్టంమీద బ్రతిమాలి బామాలి ఒప్పించాల్సివచ్చింది"

రాధారాణి మరింత ఆశ్చర్యంతో "డబ్బివ్వటం కాకుండా ఇంకా బ్రతిమలాడటం కూడానా?" అన్నది.

సత్యేంద్రుడు కుర్చీ దగ్గరకు లాక్కుకూర్చొని "అసలు మొదటిసంగతి, ఆమె ఆ వృత్తివదిలిపెట్టింది. రెండవది, ఆమెలో ఎన్ని రూపగుణాలు, శక్తిసామర్థ్యాలు వున్నా ఇంత డబ్బు ఒక్కసారి ఎవ్వరూ ఇవ్వరు. అందుచేత ఆమెపట్టుమని ఎక్కడికీ రాదు. ఇవన్నీ కాకుండా నా పట్టుదల...మూడవ కారణం" అన్నాడు.

రాధారాణి ఈ మూడో కారణాన్ని నమ్మలేదు. ఆమె కుతూహలంతో దగ్గరకువచ్చి "నీ పట్టుదల సరేగాని, ఆమె వృత్తి ఎందుకు వదిలిపెట్టిందో తెలుసా?" అన్నది.

"వింటావా?"

"ఆఁ, చెప్పు?"

సత్యేంద్రుడు క్షణంసేపు మెదలకుండా వుండి "ఆమె పేరు బిజలీ... అయితే రాణీ! ఇక్కడికి ఇంకెవరైనా వస్తారేమో? లోపలకు వెళదాంపద!" అన్నాడు.

'వెళదాం, పద' అని రాధారాణి లేచి నుంచున్నది.

*   *   *   *

భర్త పాదాలవద్ద కూర్చుని రాధారాణి విషయమంతా విన్నతర్వాత చివరికి పయటచెంగుతో కన్నీళ్ళు తుడుచుకొని "అందుకని ఇవ్వాళ ఆమెను అవమానపరిచి బకులు తీర్చుకుంటారా? మీకు ఈ బుద్ధి ఎందుకు పుట్టింది?" అన్నది.

ఇటు సత్యేంద్రునికి కూడా చెప్పేప్పుడు మధ్యమధ్య అనేకసార్లు గొంతు నిండుకొచ్చింది. "అవును. బకులు తీర్చుకుంటున్నాను. ఈ విషయం మనముగ్గురికి తప్ప ఇంకెవరికీ తెలియదు" అన్నాడు.

రాధారాణి మాట్లాడకుండా మళ్ళా ఒకసారి పయట చెంగుతో కన్నీరు తుడుచుకొని బైటికి వెళ్ళిపోయింది.

పిలిచిన పెద్దలతో పందిరంతా నిండివుంది. ఆ పై వరండాలోంచి ముత్తయిదుల కిలకిలనవ్వులు పరదాలను చించుకుని బైటికి వస్తున్నాయి. నర్తకులందరూ మేజువాణీదగ్గరకు వచ్చారుగాని, బిజలీమాత్రం తలవంచుకొని ఇంకా అక్కడే కూర్చొనివుంది. ఆమె కనుకొలుకులవెంట కన్నీరు కారుతూ వున్నాయి. మొదట్లో ఆమె, బాగా ధనం కూడబెట్టింది. కాని దీర్ఘమైన ఈ అయిదుసంవత్సరాలలోనూ అంతా ఖర్చయింది. ధనాభావంవల్లే గత్యంతరం లేక అయిదేళ్ళక్రిందట ప్రతిజ్ఞతో పరిత్యజించిన వృత్తిని మళ్ళా ఇవ్వాళ స్వీకరించవలసి వచ్చింది. కాని ఆమె సభికులముందు తలెత్తి నిలబడలేక పోయింది. తన శరీరం ఇలా స్వాధీనంతప్పిపోయిందని గంటకుముందు ఆమె వూహించలేదు.

"మిమ్మల్ని పిలుస్తూన్నారు!"

బిజలీ తలెత్తి చూచింది. పన్నెండు పదమూడేళ్ల

కుఱ్ఱవాడు ఎదురుగా నుంచున్నాడు. అతను పైవరండాకేసి చూపించి "అమ్మగారు మిమ్మన్ని పిలుస్తూ వున్నారు" అన్నాడు.

బిజలీకి నమ్మకం కలుగలేదు." "ఎవరు పిలిచేది ?"

"ఆ అమ్మగారు పిలుస్తున్నారు"

"నువ్వెవరవు"

"వారి నౌకరును"

బిజలి తలకాయత్రిప్పి "లేదు. నన్ను పిలిచి వుండదు. నువ్వు పొరపడ్డా వేమో! మళ్లా ఒకసారి వెళ్లి అడిగి రా" అన్నది.

కుఱ్ఱవాడు కొంచెంసేపు వున్నతర్వాత మళ్లీవచ్చి "మీపేరేగా బిజలీ ! మిమ్మన్నే పిలుస్తూ వున్నారు. రాండి. మీకోసం నుంచుని వున్నారు" అన్నాడు.

బిజలి వెంటనే కాళ్లగజ్జెలువిప్పి అక్కడవేసి- ఆ కుఱ్ఱ వానివెంట లోపలకెళ్లింది. బహుశా విశేషమైన పనేమైనా వుండి యజమానురాలు పిలిచిం దేమో ననుకుంది.

రాధారాణి బిడ్డనెత్తుకుని పడకటింటి గుమ్మంవద్ద నుంచు నివుంది. కొంతభయంతోనూ, కొంత సంతోషంతోనూ బిజలి ఆమె ఎదుటకు వెళ్లినుంచున్నది. రాధారాణి అత్యంతాదరం తో ఆమె చెయ్యి పట్టుకుని లోపలకు తీసుకెళ్లి బలవంతాన కుర్చీమీద కూర్చోబెట్టి "నన్నెరుగుదువా అక్కా?"అన్నది నవ్వుతూ.

బిజలి చకితురాలై ఆమెమొహంకేసి చూస్తూ నుంచు న్నది. రాధారాణి తనచంక నున్నబిడ్డను చూపిస్తూ "నువ్వు

నీ చెల్లెల్ని గుర్తించకపోతేమానె, వీణ్ణికూడా గుర్తించకపోతే చాల కోపంవస్తుంది'' అని ఆమె నవ్వసాగింది.

ఈ నవ్వుచూచినా కూడా బిజలి నోటివెంట మాట రాలేదు. అంధకారపూరితమైన ఆమె మనఆకాశం క్రమంగా స్వచ్ఛం కాసాగింది. బిజలి తదేకధ్యానంతో ఆపిల్లవాని కేసి చూచి చప్పున రెండుచేతులూ చాపి ఆపిల్లవాణ్ణి తనచంకకు తీసుకొని హృదయానికేసి గట్టిగా హత్తుకొని ఏడ్వసాగింది.

"ఇప్పటికైనా గుర్తించావా అక్కా?'' అని అడిగింది రాధారాణి.

"ఆఁ! గుర్తించాను చెల్లీ!''

"సముద్రాన్ని మథించి దానిలో వచ్చిన గరళాన్ని నువ్వు త్రాగి అమృతాన్ని నాకు దానంచేశావు. వారు నిన్ను ప్రేమించారు. కాని నేను పొందగలిగాను'' అన్నది రాధారాణి.

బిజలి సత్యేంద్రుని ఫొటో ఒకటి తీసుకుని తదేకధ్యానంతో చూస్తూ "విషం యొక్క విషమేగా అక్కా అమృతం! ఆ విషంకూడా ఈ ఘోర పాపిష్ఠిని చిరకాలజీవిగా చేసింది! అయినా నేను వంచితురాలనే'' అన్నది.

రాధారాణి దీని కేమీ సమాధాన మివ్వకుండా "వారిని ఒకసారి కలుసుకుంటావా అక్కా?'' అన్నది.

బిజలి క్షణంసేపు కళ్లుమూసికొని "నాలుగేళ్ల క్రితం వారు ఈ కులటను చూచి ఏవగింపుతో మొహం తిప్పుకు వస్తున్నప్పుడు మళ్ళా కనపడతారు, మళ్లా కలుసుకుంటా రని సగర్వంగా అన్నాను. కాని ఆ నాటి నాగర్వం నిలవదు. గర్వభంజకుడైన భగవంతుడు ఆనాటి నాగర్వం ఎందుకు అణ

చాడో ఇవ్వాళ తెలిసివస్తూవుంది" అని పయటచెంగుతో కన్నీరు తుడుచుకుని "భౌతిక కష్టాలమూలంగా నేను భగవంతుణ్ణి నిర్దయుడు, నిష్ఠురుడు అని అనేకనిందలు వేశాను. ఈ పాపిష్ఠిదానియందు ఆయనెంత దయ చూపాడో నాకు ఇప్పుడు తెలుస్తూవుంది. వారు మళ్లా వచ్చిన ట్లయితే నేనూ నాశన మయ్యేదాన్ని; వారినీ నాశనం చేసేదాన్ని" అన్నది.

రాధారాణి దుఃఖాతిరేకంతో ఏమీ మాట్లాడలేక పోయింది.

"మళ్లా ఎప్పుడైనా కనపడితే మరి పాదాలంటి క్షమాపణ కోరుకుందా మనుకున్నాను. ఇక ఆ అవసరమేమీ లేదు. నాకు ఫొటోమాత్రం యివ్వు చెల్లీ! నాకు ఇంతకంటే కావలసిందేమీ లేదు. కోరినా భగవంతుడు ఇక సహించడు. సరే! ఇక నేను వెళతాను" అని బిజలి లేచి నుంచున్నది.

రాధారాణి రుద్ధకంఠంతో "మళ్లా ఎప్పుడు కనపడతావు అక్కా?" అన్నది.

"లేదు, ఇక కనపడను. నాకొక చిన్నయిల్లు వుంది. దాన్ని అమ్ముకొని వీలైనంత త్వరలో ఇక్కడినుంచి వెళ్ళిపోతాను. అయితే ఒక్కసంగతి అడుగుతాను చెబుతావా చెల్లీ! ఇంతకాలం తర్వాత తలవనితలంపుగా నన్ను ఎందుకు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు? పిలవటానికి వచ్చిన మనిషి మీరు పేరు చెప్పవలసిన అవసర మేమొచ్చింది?

సిగ్గుతో రాధారాణి మొహం ఎర్రబడిపోయింది. తల వంచుకుని మెదలకుండా కూర్చుంది.

బిజలి కొంచెంసేపు మౌనంగావుండి "నన్ను అవమా

నించటానికే కాదు ? అందుకేనా ? అంతకు తప్ప నన్ను ఈ విధంగా ఇక్కడకు రప్పించిన కారణ మేముంటుంది ?" అన్నది.

రాధారాణి తల మరీ వంగిపోయింది. బిజలి నవ్వుతూ "క్షణంలో నీవు సిగ్గుపడవలసిన అవసరమేముంది చెల్లీ ! కాని వారుకూడా చాలా పొరపడ్డారు. నావద్ద నా దనేది ఏముంది— నాకు అవమానం జరగటానికి? సర్వస్వం వారికే అర్పించాను. అలాంటప్పుడు నా అవమానం వారి అవమానం కాదూ" అన్నది.

"నమస్కారం అక్కా?"

"నమస్కారం చెల్లీ! నిన్ను ఆశీర్వదించే అధికారం నాకు లేకపోయినా నా హృదయపూర్వకంగా నీ పసుపుకుంకుమ అక్షయంగా వుండుగాత అని భగవంతుణ్ణి ప్రార్థించు చున్నాను."

# ఛాయాప్రకాశ్

ఆదిలోనే అలా ఎప్పటికీ జరగదని గొంతుపట్టుకుంటే నే నేమీ చెప్పలేను. జరగవచ్చును, లోకంలో ఏ మూలఏమి జరుగుతూవుందో ఏవరికి అంతు అనుకుంటే ఈ కథ చదువు. దీనివల్ల ఎవరికీ ఎలాంటి నష్టమూ వుండదు అని నా నమ్మకం. కథ వ్రాయటానికి కూర్చున్నప్పుడు వ్రాసినదంతా యథార్థమౌతుందని ప్రతిజ్ఞకూడా పట్టలేదు. వ్రాసినదానిలో రెండు మూడు పంక్తులు అబద్ధం కావచ్చు, అస్వాభావికం కావచ్చు. అభిప్రాయభేద ముండవచ్చు. కాని దానివల్ల అయ్యేదీ చెడిపోయేదీ ఏమీలేదు. ఆ నాయకునిపేరు యజ్ఞదత్త ముఖర్జీ. కాని సురమ అతన్ని 'ప్రకాశ్' అంటుంది. నాయికపేరు వినసే విన్నావు. యజ్ఞదత్తుడు ఆమెను 'ఛాయ' అని పిలుస్తూ వుంటాడు. వారిద్దరిలో ఎవరు 'ఛాయ', ఎవరు 'ప్రకాశ్' అనే మీమాంస తేలక మొదట్లో కొంతకాలంపాటు కలహం జరిగింది. చివరికి సురమే – నీ తెలివితేటలు ఈమాత్రంకూడా గ్రహించలేకపోయినాయి. నువ్వు లేకపోతే నా అస్తిత్వమే వుండదు. కాని నేను లేకపోయినా నువ్వు చిరంజీవివై వుండగలవు. కనుకనే నువ్వు 'ప్రకాశ్', నేను 'ఛాయ'ను అన్నది.

యజ్ఞదత్తుడు నవ్వాడు—ఒకపక్షపు డిక్రీ పొందాలనుకుంటే పొందు, కాని పైసలామాత్రం ఏమీకాలేదు" అన్నాడు.

"నాకేం? అయింది. బాగానే అయింది. ఇకతగూలాడ నవసరంలేదు ప్రకాశ్! నువ్వు 'ప్రకాశ్' వి. నేను శ్రీమతి

'ఛాయ'ను" అంటూ ఛాయప్రకాశ్‌ను పలువిధాల యాతన పెట్టింది.

* * * *

కథ ఇంతవరకు జరిగింది. ఇక మీతోనే ద్వంద్వ యుద్ధం జరుగుతుందని భయం! వీరు స్త్రీపురుషు లంటావు నువ్వు. స్త్రీపురుషులేగాని పతిపత్నులుమాత్రం కాదంటాను నేను. వైధవ్యప్రేమని కన్నెరజేస్తావు నువ్వు. చాల పవిత్ర ప్రేమంటాను నేను. మీకెలాంటి నమ్మకమూ వుండదు. మొహం చిట్లించుకొని 'వయస్సెంత' అంటావు నువ్వు. 'ప్రకాశ్ వయసు ఇరవైమూడేళ్లు, ఛాయకు పద్ధెనిమిదేళ్ల'ని చెబుతాను నేను.

ఆ తర్వాతకూడా వినదలచుకుంటే ప్రారంభిస్తాను.

నూనూగు మీసాల యజ్ఞదత్తునికి కళ్లకు అద్దాలు, జుట్టుకి లెవండర్ సుగంధం, వంటిన ఢాకాపంచె, చొక్కా మీద గమ్మమంటూన్న ఎసెన్సు, కాళ్ళకు ఛాయ తన చేతులలో పువ్వులల్లిన ముఖమల్ స్లిప్పర్లూ, బీరువాలనిండా పుస్తకాలు, ఇంటినిండా దాసదాసీలతో వున్నాడు.

టేబులుముందు కూర్చుని వుత్తరం రాసుకుంటున్నాడు. ఎదురుగా పెద్ద నిలువుటద్దం వుంది. ఛాయ మెల్లగా పరదా తొలగించి లోపలకు వచ్చింది. మెదలకుండా వెనకనుంచివెళ్లి యజ్ఞదత్తుని కళ్లు మూయాలని ఆమె ప్రయత్నం. కాని వెనకకు వచ్చి చెయిచాపగానే ఎదురుగానున్న అద్దం కనపడింది. యజ్ఞదత్తుడు ఆమెమొహంకేసి చూచి చిరునవ్వు నవ్వుకుంటున్నాడు. సురమకుకూడా నవ్వువచ్చింది "ఎందుకు చూచావు" అన్నది.

"అదీ నాతప్పేనా ?"

"మరి, ఇంకెవరిది ?"

"సగం నీది, తక్కినసగం ఈ అద్దానిది"

"అయితే దాన్ని ఇప్పుడే మూసేస్తాను"

"మూసెయ్యవద్దు, కాని తక్కిన దానికి ఏమిచేస్తావు"

సురమ రెండుమూడుసార్లు అటూఇటూ తిరిగి "ప్రకాశ్" అన్నది.

"ఏమిటి ఛాయా ?"

"నువ్వు రోజురోజుకీ ఇలా చిక్కిపోతున్నావెందుకని?"

"నాకు అలా కనిపించడంలేదే ?

"అయితే నువ్వు సరిగా అన్నం ఎందుకు తినటంలేదు?"

యజ్ఞదత్తుడు నవ్వుతూ "నువ్వు పోట్లాటకి వచ్చావా ఏమిటి సురమా ?" అన్నాడు.

"అవును."

"అది నాకు యిష్టంలేదు."

"నువ్వు వివాహం ఎందుకు చేసుకోవు?"

"దీనికి సమాధానం కనీసం రోజు కొకసారియైనా చెబుతూ వస్తున్నాను"

"చేసుకోక తప్పదు"

"ఐతే, నువ్వెందుకు వివాహం చేసుకోవు సురమా?"

సురమ యజ్ఞదత్తుని చేతిలో వుత్తరం లాక్కొని "ఛీ! విధవ కెక్కడైనా వివాహమౌతుందా?" అన్నది.

యజ్ఞదత్తుడు కొంచెంసేపు మెదలకుండా వుండి "ఎవరికి తెలుసు? కొందరు అవుతుం దంటారు, కొందరు కాదంటారు" అన్నాడు.

"అయితే, నన్నా నిమిత్తభాగ్యురాలుగా చేయ ప్రయత్న మెందుకు?"

యజ్ఞదత్తుడు ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడచి "అయితే ఎప్పుడూ నాకు సేవచేస్తూనే కాలం గడుపుతావా ఏమిటి?" అన్నాడు.

"ఆఁ" అని ఆమె బొటబొట కన్నీరు కార్చుతూ ఏడ్వ సాగింది.

యజ్ఞదత్తుడు ఆమె కన్నీరు తుడుస్తూ "నీ మనసులో కోర్కె ఏమిటో నాకు విశదంగా చెప్పవా సురమా?" అన్నాడు.

"నన్ను బృందావనం పంపు."

"నన్ను వదిలిపెట్టి వుండగలవా?"

సురమ నోటిమాట రాలేదు. ఆమె కళ్లవెంట కన్నీరు మాత్రం కాలువలు కట్టసాగినై.

౨

"ఆ కథ మళ్లీ చెప్పు యజ్ఞ అన్నా?"

"ఏ కథ సురమా?"

"అదే, నన్ను బృందావనంలో కొన్ననాటి గాథ. ఎంతకు కొన్నావు?"

"ఏభై రూపాయలకు. నా కప్పుడు పద్ధెనిమిదేళ్లుంటాయి. బి. ఏ. పరీక్షలైన తర్వాత పడమట సంచారానికి వెళ్లాను. అమ్మ అప్పుడు బ్రతికే వుంది. ఆమెకూడా వెంట వుంది. ఒకనాటి ఉదయాన వైష్ణవదళ మొకటి మాలతీకుంజ

దగ్గరనుండి భజన చేసుకుంటూ వెళుతూవుంది. వారిలో మొట్ట మొదటగా నేను నిన్ను చూచాను. యౌవనసౌధపు ప్రథమ సోపానం ఎక్కగానే ప్రపంచ మంతా కనులువండువగా కన పడుతుంది. దాని మాధుర్యా న్ననుభవించటానికి రెండుకళ్లు చాలవు. మనసులాంటి మరి రెండు కళ్లతో దాని శోభ నను భవించా లని కోర్కె కలుగుతుంది.......ఇదేమిటి సురమా! ఏడుస్తున్నావు?" అన్నాడు.

"లేదు, నువ్వు చెప్పు"

"అప్పుడు నువ్వు పదమూడేళ్ల నవీన వైష్ణవివి-చేతిలో తాంబూరా వుంది. కీర్తన పాడుతున్నావు?"

"పో, నేను పాట పాడ గలనా ఏమిటి?"

అప్పుడు 'పాడేదానివి. ఆ తర్వాత ఎంతో పరిశ్రమతో నిన్ను పొందాను. నువ్వు బ్రాహ్మణ బాల వితంతువవు. మీతల్లి తీర్థయాత్రకువచ్చి మళ్లీ తిరిగి వెళ్లలేను. ఇక్కడే చనిపో యింది. నేను నిన్ను తీసుకొని మా అమ్మచేతి కప్పగించాను. ఆమె హృదయానికి హత్తుకుంది. ఆమె చనిపోతూ మళ్లీ నిన్ను నా కప్పగించి పోయింది."

"మా ఇల్లెక్కడ యజ్ఞఅన్నా ?"

కృష్ణనగరం వద్ద ఎక్కడోవుందని విన్నాను."

"నాకు ఇంకెవరూలేరూ ?"

"నేనున్నాగా. ఇదీ నీసర్వస్వం, సురమా !"

సురమ కనుకొలకుల్లో మళ్లా నీరు తిరిగినై. "నువ్వు నన్ను మళ్లా అమ్మగలవా" అన్నది.

"లేదు. అలా చేయలేను. నన్ను అమ్ముకోండే ఈపని ఎప్పటికీ జరగదు"

సురమ ఏమీ మాట్లాడలేదు. కన్నీటి కళ్ళతో అతని కేసి చూస్తూ వుండిపోయింది. చాలసేపున్న తర్వాత మెల్లగా నువ్వు అన్నవు, నేను చెల్లెల్ని, మనిద్దరిమధ్య ఒకవదినను తీసుకు రారాదు అన్నయ్యా!" అన్నది.

"ఎందుకు ?"

"పగలంతా ఆమెకు సింగారించి నీ ముందుకు తీసుకొచ్చి కూర్చోబెడుతూ వుంటాను"

"అలా నువ్వు హృదయపూర్వకంగా చేయగలవా ?"

సురమ తలపైకెత్తి అతని కళ్ళల్లోకి చూచి "ఈర్ష్యపడటానికి నేనంత అధమురాలనా ఏమిటి ?" అన్నది.

"ఈర్ష్య పడవుగాని, నీస్థానాన్ని గోల్పోతావుగా"

"ఎందుకు గోల్పోతాను ? నేను రాజుకు రాజుసయ్యో వుంటాను. ఒక మంత్రిని మట్టుకు సాయం తీసుకుంటాను. ఇద్దరమూ కలసి నీరాజ్యాన్ని నడుపుతాం. చాల ఆనందంగా వుంటుంది"

"చూడు ఛాయా, నాకు వివాహం చేసుకోటానికి యిష్టంలేదు. కాని నీకు ఒక చెల్లి అవసరమైతే తప్పకుండా చేసుకుంటాను"

"ఆఁ తప్పకుండా చేసుకో. చాల ఆనందంగా వుంటుంది. ఇద్దరమూ కలసి చాల కులాసాగా కాలం గడుపుతాం"

అని సురమ మనసులో "మూడుతరాలలో నా వా రెవరూ లేరు. మానాభిమానాలు గూడా లేవు. కాని నామూలాన లోకమంతటా ఎందుకు అపవాదు వేసుకు తిరుగుతావు ? నువ్వు నా దైవానివి! నువ్వు వివాహం చేసుకో. నీ మోహం చూచి నేనంతా సహించగలను" అనుకున్నది.

3

కలకత్తాలో తెలుసుకోకుండా వుంటే పక్కింటి సంగతులుకూడా తెలుసుకోనివారు తెలుసుకుంటే పుట్టుపూర్వోత్తరాలన్నీ తెలుసుకునేవారు చాలామంది వున్నారు. తెలిసినవారు యజ్ఞదత్తుడు బి. ఏ. పాసయితే మాత్రమేం? వట్టి గాలివాడు అంటూ వుండేవారు. సంజ్ఞతో సురమ సంగతి సూచిస్తూ వుండేవారు! అప్పు డప్పుడూ ఈ సంగతి ఛాయా ప్రకాశ్ ల చెవినికూడా పడుతూ వుండేది. విని ఇద్దరూ విరగబడి నవ్వుకునేవారు.

మంచివాడికైనా చెడ్డవాడికైనా, ధనవంతుడవైతే మీ యింటికి నలుగురూ వస్తారు – ముఖ్యంగా స్త్రీలు.

"మంచి పిల్లను చూచి చెయ్యరాదు!" అనేది సురమ సమాధానంగా.

సురమ చెలికత్తె నవ్వుతూ "అదే, మంచిపిల్ల దొరకుటే కష్టం. నిన్ను చూచిన కళ్లతో... ..."అనేది.

"పో! పాడుమొహమా..." సురమ మొహమంతా స్నేహంతోనూ, గర్వంతోనూ ఎర్రబడిపోయేది—

ఆ రోజు ఉదయాన జోరున వర్షం కురుస్తూ వుంది. సురమ గదిలోకి రాగానే "ఒక పిల్లను చూచివచ్చాను" అన్నది.

"అబ్బా, నెత్తిమీదనుంచి ఒక భారం వదిలింది. ఎక్కడో కొంచెం చెప్పు?" అన్నాడు యజ్ఞదత్తుడు.

"ఆ వీధి మేస్త్రీలయింట"

"బ్రాహ్మణుడై నై కాయస్థుల ఇంటా... ?"

"కాయస్థుల ఇంట్లో బ్రాహ్మలు వుండరా ఏమిటి? తల్లి అక్కడ వంటపని చేస్తూవుంటుంది. పిల్ల చాలాబాగుంటుం దని విన్నాను. వెళ్లి ఒకసారి చూచిరా, నచ్చితే చేసుకుందువుగాని"

"లోకంలో బికారులు తప్ప మరో ఆధారం లేనంత అభాగ్యుణ్ణా ఏమిటి నేను?"

"బికారులను తీసుకురా. నీ కేం కొత్త పనికాదుగా!"

"అయితే...!"

"కాదు. నీవు వెళ్లి చూచిరా. మనసునకు నచ్చితే కాదనకు"

"మనసుకు ఏ స్థితిలోనూ నచ్చదు',

"నచ్చుతుంది. బాగానే నచ్చుతుంది. ఒకసారి చూచిరా."

ఛాయాదేవి ప్రకాశ్ ని పట్టుకొని అత్తరు సెంట్లూ పూసింది. తల దువ్వి బొట్టుపెట్టి అద్దం ముందుకు తీసుకొచ్చేప్పటికి యజ్ఞదత్తునికి సిగ్గేసింది. "ఛీ! అత్తై పోతూ వుంది' అన్నాడు.

"కాని, ముందు నువ్వు చూచిరా" అన్నది సురమ.

యజ్ఞదత్తుడు బండెక్కి పిల్లను చూచి రావటానికి వెళ్ళాడు. దారిలో ఒక మిత్రుడు కనపడేప్పటికి "పద, మేస్త్రీల యింటికి వెళ్లి కాఫీ త్రాగి వద్దాం" అన్నాడు.

"అంటే......?" అన్నాడు మిత్రుడు.

"వారింట ఒక భిక్షుక పిల్లవుంది. పెండ్లి చేసుకుంటాను.

"అనేది ఏమిటి, ఈ శిక్ష నీకు ఎవరిచ్చారు ?"

"మీరు ఎవరియందు ఈర్ష్యతో చస్తున్నారో, ఆ ఛాయాదేవి"

యజ్ఞదత్తుడు స్నేహితుని తీసుకొని పిల్లను చూట్టానికి మేస్త్రీల ఇంటికి వెళ్లాడు. పిల్ల తివాసీమీద కూర్చునివుంది. వలలాంటి విదేశీచీర కట్టుకుంది. చేతులకు మట్టిగాజు లున్నాయి కాళ్ళకు సత్తురంగు వెండికడియా లున్నాయి. అక్కడక్కడా వాటిలోపలి రాగికడ్డీకూడా కనపడుతూవుంది. తలకు మొహాన కూడా కాశేంత చమురు పూసివుంది. ముడి నడినెత్తిన గట్టిగా బిగించి వుంది. స్నేహితులిద్దరూ ఆమెను చూడగానే నవ్వు కున్నారు. నవ్వు కప్పిపెట్టుకొని యజ్ఞదత్తుడు పిల్లకేసిచూసి "నీపేరేమిటి ?" అని అడిగాడు.

పిల్ల తన పెద్దపెద్ద నేత్రాలను అతని మొహం వైపుకు తిప్పి శాంతంగా "ప్రతుల" అన్నది.

యజ్ఞదత్తుడు స్నేహితునిమీద చరచి చిరునవ్వుతో "ఏంరా! గదాధరుడు * కాదుగదా ?"

స్నేహితుడు ఒక చిన్నతోపు తోసి "ఆశే వాగక. చప్పున ఏదో ఒకటి నిశ్చయించుకో" అన్నాడు.

"ఆఁ యిప్పుడేనా?"

"సరే, ఏమి చదువు తున్నావు?"

"ఏమీ లేదు"

"ఇంకా మంచిది"

"పనిపాటలు చేయటం వచ్చునా?"

---

* స్వ॥ గిరీశచంద్రఘోష్ రాసిన బెంగాలీ నాటకంలో ఒకపాత్ర పోలీసులు పట్టుకుంటారనే భయంతో ఆడవేషం వేసుకుని దాక్కుంటాడు.

ప్రతుల తలకాయ తిప్పింది. దగ్గరనే ఒక దాసీది నుంచుని వుంది. "చాలా చురుకైన పిల్లబాబుగారు! వండటం, వడ్డించటం, ఒకటేమిటి...అన్నీ తల్లిలాగానేచేస్తుంది. నోరెత్తి మాట్లాడదు. చాల మెత్తనిది". అని వ్యాఖ్యానంచేసి చెప్పింది.

"అది కనపడుతూనే వుంది. తండ్రి ఉన్నాడా?

"లేదు"

"తల్లికూడా చనిపోయిందా?"

"అవును"

ఈ వెర్రిపిల్ల కళ్లల్లో నీరు తిరగటం చూచి "నీ కెవరూ లేరా?" అన్నాడు యజ్ఞదత్తుడు.

"లేరు"

"మా యింటికి వస్తావా?"

ఆమె తలకాయ తిప్పి "వస్తాను" అంది. ఇంతలో ఆమె దృష్టి కిటికీ వైపుకు మరలింది. కిటికీలోంచి రెండుకళ్లు నిప్పులు కురిపిస్తూ వున్నాయి. ఆమె భయపడి "రాను" అన్నది.

బైట మేస్త్రీగారు కనపడ్డారు.

"పిల్ల ఎలా వుంది?"

"బాగానే వుంది"

"అయితే, పెండ్లి ముహూర్తం నిశ్చయించుదామా?"

"ఆఁ ఆఁ"

## ౪

పన్నెండు పదమూడేళ్ల వయసు గల కుర్రవానిచేతిలోంచి నిర్దయ రసహీను డెవరైనా చదువుతూ వున్న అభిరుచి గల నవలను లాక్కుని దాస్తే, దానికోసం అతని హృదయం

ఎంత వ్యాకులపాటుతో, ఆతురతతో తిరుగుతుందో - అలాగే సురమ యజ్ఞదత్తునికోసం వ్యాకులపడసాగింది. ఏమి వెతికి తీసుకోస్తుందో ఏమి తెలుసు. కుర్చీ, బెంచీ, సోఫా, పక్క, గది, వరండా అన్నిటిమీద ఆమె మండిపడుతూ ఉంది. బజారు వైపు కిటికీ ఒక్కటీకూడా ఆమెకు నచ్చలేదు. కొంచెంసేపు దానిమీద కూర్చోసాగింది. యజ్ఞదత్తుడు గదిలోకి వచ్చాడు.

"ఏమైంది ప్రకాశ్ మహాశయా?" ప్రకాశ్ మొహం గంభీరమైంది.

"వచ్చిందా?"

"ఆఁ"

"వివాహం ఎప్పుడు?"

"బహుశా ఈ మాసంలోనే"

నిరానందోత్సాహంతో సురమ దగ్గరకు వచ్చింది. కాని ఆమె ఎలాంటి గల్లంతూ చేయలేదు. "నాతోడు, నిజంచెప్పు" అన్నది.

"ఈ వీ డేమిటి? నిజమేగా చెప్పేది?"

"నా మొహం వంక చూచి చెప్పు - వచ్చిందా?"

"ఆఁ"

చప్పున మాట్లాడటానికి సురమ కేదీ దొరకలేదు. విదిలింపు తిన్న కుర్రవాడిలాగ తలకాయ అటూ ఇటూ తిప్పి "నేను మొదటే చెప్పాను" అన్నది.

యజ్ఞదత్తుడు తన ఆలోచనలోనే మునిగి వుండి ఈ మాటేమీ వినలేదు. దాని కొక అర్థ ముంటుం దని అతను ఊహించనుకూడా లేదు. ఎందుచేత నంటే నచ్చుతుం దన్న విషయం సురమ ఎప్పుడూ చెప్పనుకూడా లేదు. ఆమె

స్వయంగా కూడా పిల్లను చూడలేదు. ఇంత తొందరగా వస్తుందని, సంబంధం ఖాయమౌతుందని ఆమె ఊహించను కూడా లేదు. అందుచేత ఆమె రాత్రింబగళ్లు గదిలో కూర్చుని ఈ సంగతి ఆలోచించసాగింది. "ఈ పెళ్లి చేయకు సురా" అన్నాడు.

"అరే! లగ్నం కూడా ఖాయమైంది. అదెలా జరుగుతుంది."

"ఏమీ ఖాయం కాలేదు"

"అదేమీ కుదరదు. ఆ అనాథ పిల్లను సుఖపెట్టాలన్న సంగతికూడా కొంచెం ఆలోచించుకో! అదీగాక మాటిచ్చి తప్పుకుంటావా?

యజ్ఞదత్తునికి ప్రతులకుమారి మొహం జ్ఞాపకమొచ్చింది. ఆ నల్లని కళ్లల్లోని సహిష్ణుతా, శాంతభావం స్పష్టంగా కనపడ్డాయి. అందుచేత అతను మళ్లీ నోరెత్తలేకపోయాడు. అయినా అనేక సంగతులు ఆలోచించాడు. సురమను గురించి ఎక్కువగా ఆలోచించాడు. వర్షపురోజుల వుసుళ్లలాగ అతని మనసంతా కలవరపాటుతో నిండిపోయింది. అవి దాగియున్న వాసగహ్వరం వెతికినా దొరకనట్టు సురమ అన్నమాటలు ఏగుప్తాకాంక్షలోంచి బారులు తీరి వస్తూవున్నాయో తెలియదు. అతని కళ్ళముందు తెరలలా అడ్డువచ్చాయి. అందుచేత సురమ మొహం కనబడలేదు,

❧

పెండ్లిచేసుకొని యజ్ఞదత్తుడు వధువుని ఇంటికి తీసుకొచ్చాడు. వికారగ్రస్తరోగి ఇంట్లో ఎవరూ లేకుండా చూచి

కాలికొద్దీ పరుగెత్తి చన్నీటి కుండకు అతుక్కుపోయినట్టు సురమ నూతన వధువు హృదయానికి అతుక్కుపోయింది. తన నగలన్నీ తీసి ఆమెకు పెట్టింది. తన చీరలన్నీ ఆమె పెట్టెలో నింపింది. శష్కవదనంతో పగలంతా వధువుని అలంకరించే ఆడంబరం చూచి యజ్ఞదత్తుని మొహం గంపెడై పోయింది. నిద్రలో వచ్చిన స్వప్నాన్ని సహించవచ్చు. అసహ్యమనిపించగానే మెలకువ వస్తుంది. కాని జాగ్రదవస్థలో వచ్చిన స్వప్నం చూడమంటే ప్రాణంమీదికి వస్తుంది. ఎంతసేపటికీ పూర్తికాదు. కొంతసేపు స్వప్నమనిపిస్తూ వుంటుంది. కొంతసేపు యథార్థంగా తోస్తుంది. ఛాయాప్రకాశ్ లిద్దరికి ఇలాంటి భావమే కలుగ సాగింది. ఒకరోజున యజ్ఞదత్తుడు "ఛాయా!" అని పిలచాడు.

"ఏమిటి యజ్ఞ అన్నయ్యా?"

"ప్రకాశ్ అనలేవా?"

సురమ తలవంచుకొని "ప్రకాశ్!" అన్నది.

యజ్ఞదత్తుడు చేతులు రెండూ జాపి "చెంత కూర్చుని చాలకాలమైంది. ఇటురా!" అన్నాడు.

సురమ క్షణంసేపు అతని మొహంకేసి చూచి "నే నెలాంటిదాన్ని? వధువును ఒంటరిగా వదలిపెట్టి వచ్చాను" అంటూ అమె చప్పున పారిపోయింది.

కోపంలో అపరిచితపెద్దమనిషి నెవరినైనా చెప్పుదెబ్బ కొట్టితే అతను శాంతంగా క్షమించి పోయినపుడు మనస్థితి ఎలావుంటుంతో అలాగే క్షమాప్రాప్త అపరాధిలాగ యజ్ఞదత్తుని మనసుకూడా క్రమేపి వుత్సాహహీనమై పోసాగింది.

అతనికి అపరాధం చేశాను, సురమ నన్ను హృదయపూర్వకంగా క్షమించిం దనిపించింది.

సురమ సర్వాభరణ భూషితమైన వధువును బలవంతంగా దగ్గరకు తీసుకొచ్చి కూర్చోబెట్టి బైట గొళ్లెం పెట్టి పోయేది. యజ్ఞదత్తుడు గడ్డంకింద చెయిపెట్టుకు కూర్చుని ఆలోచిస్తూ వుండేవాడు. వధువుకూడా కొంతకొంత గ్రహిస్తూ వుండేది. ఆమె ఈడేరినపడుచు కాకపోయినా స్త్రీయేగా. సామాన్య స్త్రీ తెలివితేటలలో భగవంతు డెవరికీ కొరతరానీయడు. ఆమెకూడా రాత్రంతా మేలుకొనే వుండేది.

పెండ్లయి ఇవ్వాళకి ఎనిమిది రోజులుకూడా లేవు. ఈ మధ్యలోనే అత నొకరోజు వుదయాన సురమను పిలచి "బర్ద్వాన్ వెళ్లి వధువును మేనత్తకు చూపించి వస్తాను సురా" అన్నాడు.

మేనత్తగారి వూరు దామోదరనది అవతల వున్నది. మేనత్తగారింటికెళ్ళగానే "వధువును తీసుకొచ్చాను చూడు అత్తా!" అన్నాడు యజ్ఞదత్తుడు.

"అరే! పెళ్లి చేసుకున్నావా! వెయ్యేళ్ళఆయుస్సు నాయనా! చంద్రబింబంలాంటి కోడలు! ఇక చక్కగా సంసారం చేసుకో!" అన్నది అత్త.

"అందుకనే సురమ పట్టిబలవంతాన వివాహంచేసింది"

"అయితే, సురమ వివాహం చేసిందా?"

"ఆమేగా చేసింది. కాని దురదృష్టం! ఈ భార్యను తీసుకుని నేను ఇంటికి వెళ్లలేను"

"అలా ఎందు కని?"

'నాది నరగణ మని తెలుసుగా అత్తా! ఆమెది రాక్షస

గణం. ఇద్దరమూ కలిసి ఒకచోట వుండటం శుభకరం కాదని జ్యోతిష్కుడు చెప్పాడు"

"అలాగా నాయనా!"

"అప్పుడు తొందరలో ఈ సంగతు లన్నీ ఆలోచించలేదు. ఇక ఈమె మీ ఇంటివద్దే వుంటుంది. ప్రతినెలా యాభై రూపాయలు పంపుతూ వుంటాను. చాలదు అత్తా?"

"ఆఁ చాలకేందుకు! పల్లెటూళ్లలో ఖర్చెంతగా ఏముంటుంది? చందమామలాంటి భార్య; పెద్దదైంది. ప్రాయశ్చిత్త మేదైనా చేసుకుంటే పోదూ?"

"పోవచ్చు. అయినా భట్టాచార్యులుగారిని అడిగి కబురు చేస్తాను"

"సరే, అలాగే చెయ్యి నాయనా!"

సాయంత్రం భార్యను దగ్గరకు పిలచి "అయితే నువ్వు ఇక్కడే వుండు" అన్నాడు.

ఆమె తలకాయి త్రిప్పి "సరే" అన్నది.

"నీ కేదైనా అవసరమైనప్పుడు నాకు కబురు చేస్తూ వుండు"

"సరే"

"నువ్వు ఉత్తరం రాయగలవా?"

"రాయలేను"

"అయితే, ఎలా కబురు చేస్తావు?"

నవవధువు పెంపుడు లేడిలాగ తన కళ్లను భర్త మొహం మీద పరపి మెదలకుండా నుంచున్నది. యజ్ఞదత్తుడు మొహం త్రిప్పుకొని వెళ్ళిపోయాడు.

భర్త మేనత్తగా రింటివద్ద ఆమె తూర్పు తెల్లవారక

నుందే లేచి పనిపాటలలో మగ్నమైపోయేది. కూర్చొనట మనేది ఆమె నేర్చుకోనేలేదు. కొత్తైనప్పటికి బాగా పరిచయ మున్నవారిలా ఇంట్లో పనిపాటలు చేయ నారంభించింది. అలాంటి పిల్ల అందరికి దొరకటం దుర్లభ మని రెండుమూణాళ్ల ల్లోనే గ్రహించింది మేనత్త.

వధువు వద్ద చాలా నగలున్నాయి. ఊరంతా చూట్టా నికి వచ్చారు. "ఎవరు చేయించారు అమ్మాయి? మీ నాన్నా?" అని అడిగారు ఎవరో.

"నా తలిదండ్రులు లేరు. ఆడబిడ్డ యిచ్చింది."

ఒక రిద్దరు సమానవయస్కులలో స్నేహం కలిసిన తర్వాత గుట్టు తెలుసుకో ప్రయత్నించ సాగారు. "మీ ఆడ బిడ్డ చాల పెద్దమెత్తు గలదై వుంటుంది."

"నగలన్నీ ఆమెవేనా ?"

"అన్నీ"

"ఆమె పెట్టుకోదు."

"ఆమె విధవ, పెట్టుకోదు"

"ఎంత వయస్సుంటుం దమ్మా ?"

"మనకంటె కొంచెం పెద్దది. ఆమే బలవంతాన మా పెళ్ళి చేసింది.

"నీభర్త ఆమె చెప్పిన మాట బాగా వింటాడా ఏమిటి?"

"వింటారు; ఆమె సతీ, లక్ష్మి. అంతా ఆమెను ప్రేమిస్తారు"

౬

మేడపై కిటికీలోంచి సురమ చూచింది – యజ్ఞదత్తుడు ఇంటికి వచ్చాడుకాని, వెంట భార్యలేదు. ఇంట్లోకి రాగానే

"వదెన్ని ఎక్కడ వదిలిపెట్టి వచ్చావు అన్నయ్యా?" అని అడిగింది.

"మేనత్తగారింటివద్ద"

"వెంటపెట్టుకొని ఎందుకు తీసుకురాలేదూ?"

"కొంతకాలంపాటు వుండనీ, ఆతర్వాత చూడవచ్చు."

ఈ మాట సురమ మనసులో నాటుకు పోయింది. ఇద్దరూ మౌనంగా వుండిపోయారు. ప్రేమీ - ప్రేమికలు వాదించుకుంటూ తలవని తలంపుగా తగూవచ్చి కొంచెంసేపు ఇద్దరూ మౌనముద్ర దాల్చి కూర్చున్నట్టు - వీరిద్దరూ కూడా కొన్నాళ్లపాటు మౌనంగా గడిపారు. "స్నానసంధ్యలు చేసి భోజనం చెయ్యి - వేళమిగిలిపోతూ వుంది" అనేది సురమ "ఆ వెళుతున్నాను" అనేవాడు యజ్ఞదత్తుడు.

అలాకూడా కొంతకాలం గడచిపోయింది.

ఒక్కచోటవుండి ఎప్పుడూ ఇలా ఇంటిని సాకటంకష్టం. అందుచేత మళ్లా సఖ్యత కుదిరేది? యజ్ఞదత్తుడు మళ్లా ప్రేమతో 'ఛాయా!' అని పిలచేవాడు. కాని ఛాయ యిప్పుడు 'ప్రకాశ్' అనటం లేదు. ఒకప్పుడు 'యజ్ఞ అన్నా' 'అన్నా,' మరొకప్పుడు కేవలం 'అన్నా' అని పిలుస్తూ ఉండేది.

ఒక రోజున సురమ యజ్ఞదత్తునితో "దాదాపు మూడు నెల్లొవ్వొస్తోంది. వదినను ఇక తీసుకురా అన్నయ్యా!" అన్నది.

యజ్ఞదత్తుడు 'ఆఁ అదే వస్తుందిలే' అని ఆమెమాటను తోసిపారేశేవాడు. సురమ అతని మనోభావాన్ని గ్రహించి మెదలకుండా వూరుకునేది.

మేనత్త దగ్గరనుండి అప్పుడప్పుడూ ఉత్తరాలు వస్తూ

వుండేవి. 'అమ్మాయికి మలేరియా జ్వరం వస్తోంది. వైద్యం అవసరం...' అని రాసేది. యజ్ఞదత్తుడు దాని అంతరార్థాన్ని గ్రహించి మరికొంత పైకం ఎక్కువ పంపించేవాడు. మళ్లా నెలవరకు ఆ ప్రమేయమే వచ్చేదికాదు.

ఇంతలో ఒక రోజున తలవని తలంపుగా మేనత్త చనిపోయిం దని వుత్తరం వచ్చింది.

యజ్ఞదత్తుడు వర్ధమాన్ వెళ్లాడు. వెళ్లేప్పుడు సురమ వదినను తీసుకురమ్మని ఒట్టువేయించుకు మరీచెప్పింది.

వర్ధమాన్‌లో మేనత్త శ్రాద్ధకర్మలన్నీ అయిపోయిన తర్వాత, ఒకరోజు మధ్యాహ్నం యజ్ఞదత్తుడు వరండాలో కూర్చుని ఇంటికి వెళ్లాలనుకుంటున్నాడు. భార్య వాకిట్లో వడ్లపురి దగ్గర నుంచుని వుంది. తలెత్తి చూడగానే అతను కనపడ్డాడు. అతను చేతిసైగతో ఆమెను దగ్గరకు పిలచాడు.

భార్య దగ్గరకు వచ్చింది.

"ఎందుకు ?"

"మీతో ఒకమాట చెప్పాలి ?"

"సరే, చెప్పు."

భార్య గుటకమింగి "ఒకరోజున మీ రన్నారు - నా కేదైనా అవసర మైతే.........."అన్నది.

"అవును, అవును, ఏమి అవసరమో చెప్పు ?"

"ఇంట్లో అంతా నన్ను నిర్భాగ్యురా లని నీచంగా చూస్తున్నారు. ఇక ఇక్కడ వుండదలచుకోలేదు"

"ఎక్కడ వుండదలచుకున్నావు ?"

"కలకత్తాలో మంచియింట్లో ఎక్కడైనా పని దొరికితే - నాకు పను లన్నీ చేయటం చేతనవును.

"మీ యింటికి వెళతావా ?"

"మా ఇల్లా ? ఎక్కడవుంది ? ఇప్పుడు వారు వుండ నిస్తారా ?"

యజ్ఞదత్తుడు తన చేతో భార్యమొహం పైకెత్తి "మా యింటికి వస్తావా ?" అన్నాడు.

"వస్తాను."

"సురమ నీకోసం చాలా ఆదుర్దా పడుతూవుంది"

సురమ సంగతి వినగానే ఆమె మొహం సంతోషంతో వికసించింది. "అక్క నన్ను తలుచుకుంటూవుందా ?"

"రోజూ తలుచుకుంటూ వుంది."

"అయితే పదండి."

ఎంత వెతికినా ఇతరులను గురించి తన కొక నిశ్చితాభిప్రాయం దొరుకనివారు ప్రపంచంలో చాలమంది వున్నారు. దానితోపాటు వారిలో మరొక సహజగుణం కూడా వుంటుంది. దానిమీద ఆధారపడువారు తన్ను గురించి మరొక రెవరినీ సలహా లడగటానికి యిష్టపడరు. నవవధువు ఈకోటిలో చేరినదే. ఆమె తన సంగతి తనే ఆలోచిస్తుంది. ఇతరుల నడగదు. ఆమె ఆలోచించి "మీకు అశుభం కలుగుతుం దని నాకు చాలభయంగా వుంది. కాని వుండినా ఎక్కడవుండను ? లేకపోతే నేను కిందే వుంటూవుంటాను. పనిపాటల కన్నిటికీ వీలుగా వుంటుంది" అన్నది.

"పైన నువ్వు వుండటానికి గది లేదా ఏమిటి?"

"ఉంది, కాని కిందగదిలోనే బాగుంటుంది."

యజ్ఞదత్తుడు ఇం కేవిషయమూ అడుగలేదు. ఇవి బొత్తిగా పిచ్చిమాటలు కావని అనుకున్నాడు. ఆమె నిర్భా

గ్న్యారాలు కాదు, రాక్షసగణం మొదలైన వన్నీ వట్టిది - అని చెప్పా లనిపించింది మనసులో, కాని అబద్ధ మాడటానికి కారణ మేమిటో అడెలా చెబుతాడు? ఇంటికి వెళ్లి ఆమె తన ముందు వెనుకల వ్యవహారాల్లో బాగా సామంజస్య ముంచ గలుగుతుం దని నమ్మ లేక పోయాడు.

౭

సురమ వధువు రావటం చూచింది. ఉగ్రమైనకోపు మొదటి విసురుకు తట్టుకొని ఇప్పు డామె నిశ్చలమైపోయింది. అందుచేత వధువును చూట్టానికి ఆమె ఆతురత పడ లేదు. ధీర భావంతో శాంతంగా మాట్లాడింది. బైటికే కాదు, ఆంతరంగిక శుభేచ్ఛకూడా ఆమె శుష్కవదనంమీద మళ్లా వెలుగును తీసు కొచ్చింది.

"నీకు అక్కడ వుండటానికి బాగుండ లేదా వదినా?" అన్నది.

వధువు తలవూగిస్తూ "మధ్య మధ్య జ్వరం వస్తూవుంది" అన్నది.

సురమ ఆమె నొసటిచెమట తుడిచి "ఇక్కడ చికిత్స చేయిస్తే అంతా నయమౌతుంది" అన్నది.

వధువుకు క్రిందగది బాగుచేస్తున్నా రని సురమకు మధ్యాహ్నం తెలిసింది. అవమానంలో ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగినై. ఎంతో ప్రయత్నంతో కంటినీరు ఆపుకొని యజ్ఞ దత్తుని దగ్గరకువచ్చి "వదిన కింద పడుకుంటుందా అన్నయ్యా?" అన్నది.

యజ్ఞదత్తుడు పుస్తకంమీదనుంచి కన్నెత్తకుండానే "ఆమె అలానే అంటోంది" అన్నాడు.

"నువ్వేమీ చెప్పవు?"

"నేనేం చెబుతాను? ఎవరి మనసొచ్చినట్లు వారిని చెయ్యనియ్యి."

సురమ లజ్జాభిమానాలను సంబాళించుకోలేక అతని ముందే ఏడ్చి వెళ్ళిపోయింది.

ఈ పైసంగతి క్రిందవరకూ రాలేదు.

కొత్త కోడలు కొత్త విధంగా ఇంట్లో పనిపాటలలో మగ్నమైపోయింది. క్రమంగా ఆమె సురమచేతిలో పనులన్నీ తన చేతిలోకి తీసుకుంది. కాని పైకి వెళ్ళటమూ లేదు. భర్తను కలుసుకోవటమూ లేదు. క్రమంగా సురమకూడా పైకి రావటం పోవటం మానేసింది. సురమ ప్రఫుల్లవదనంతో పని చేస్తూ, పనిచేయటంలో ఎంత సుఖముందో చూపిస్తూ వుండేది. సురమ దగ్గరకూర్చుని పనివంకలో దుఃఖాన్ని ఎలా మర్చిపోవచ్చో తెలుసుకుంటూవుండేది. ఇద్దరిమధ్యా విశేష సంభాషణ లేమీవుండేవికాదు. అయినా వారిలో పరస్పరసానుభూతి క్రమంగా వృద్ధి కాసాగింది.

వధువుకు అప్పుడప్పుడు జ్వరంవచ్చి రెండు మూడు లంకణాలతో దానంతట దే పోతూవుండేది. ఆమెకు మందు తీసుకోవాలన్న వుద్దేశ్యమూలేదు, తీసుకోదుకూడా. ఆ సమయంలో పనిపాటలు నౌకర్లే చేస్తూవుంటారు. సురమవల్లకాదు. చెయ్యాలని వున్నా సామర్థ్యం లేదు.

సువర్ణప్రతిమలాంటి సురమ కాంతి, లావణ్యం, అందం ఈ రెణ్ణెల్లల్లో ఏ మైనాయో తెలియదు. వధువు అప్పు

డప్పుడూ "నువ్వు రోజురోజుకీ అలా అయిపోతున్నా వేం అక్కా?" అని అడిగేది.

"నేను నా ఆరోగ్యం కుదటపర్చుకోటానికి ఎక్కడి కైనా వెళ్ళితే నీకు ఇబ్బంది కలుగదుగదా వదినా!"

"ఎందుకు కలుగదు? తప్పకుండా కలుగుతుంది."

"అయితే వెళ్ళను."

"వద్దు అక్కా, వెళ్ళొద్దు. నువ్వు ఇక్కడే వుండి మందు తీసుకో!"

సురమ ఆప్యాయంతో ఆమె నొసటిని ముద్దెట్టుకుంది.

ఒక రోజున సురమ యజ్ఞదత్తునికి అన్నం వడ్డించుతూ వుంది. యజ్ఞదత్తుడు ఆమె శుష్కమలినవదనం కేసి తృష్ణా దృష్టితో చూస్తున్నాడు. సురమ కన్నెత్తి చూడగా నేను దీర్ఘమైన నిట్టూర్పు విడచి "చనిపోతే బాగుంటుం దనిపిస్తూ వుంది" అన్నాడు.

"ఎందు కని?" అంటూవుండగానే సురమ కళ్ళల్లో నీరు తిరిగినై.

"ఇంకెంతకాలం ఈ అసువులభారం మోయవలసి వస్తుందో నని భయంగా వుంది."

శరాఘాతం తగిలిన అడవిమృగం భూమినివదిలి ఆకాశం మీదికి పారిపోవా లని ప్రాణా లొడ్డి ఎగురుతుంది. కాని ఆకాశంవల్ల ఏమీ కాక, ఆశ్రయశూన్యమై మరణాసన్నమైన జీవం చిరాశ్రయమైన పృథ్వినే కౌగిలించుకొని ప్రాణా లొది లినట్టు ఆరాటపడుతున్న సురమ మొదట ఆకాశం కేసిచూచి సరిగ్గా ఆలాగే తర్వాత కిందపడి "క్షమించు 'యజ్ఞ అన్నా

నేను నీ శత్రువును. నన్నెంకెక్కడికైనా పంపించి నువ్వు సుఖం గావుండు" అని ఏడ్వసాగింది.

నాకెవరైనా వస్తారనే భయంతో యజ్ఞదత్తుడు ఆమె చేయిపట్టుకొని లేవదీశాడు. ప్రేమతో ఆమె కన్నీళ్లు తుడుస్తూ "ఛీ! చిన్నతనం చేస్తావు?" అన్నాడు.

కన్నీరు తుడుచుకుంటూ సురమ చప్పున గదిలోకి వెళ్లి లోపల గొళ్లెం వేసుకుంది.

౮

ఆ తర్వాత ఒక రోజున సురమ వధువును చెంతకు తీసుకుని మెల్లగా "అన్నయ్య ఎప్పుడైనా ఏ మైనా అన్నాడా వదినా?" అని అడిగింది.

వధువు సహజభావంతో "ఏమంటారు?" అన్నది.

"అయితే నువ్వు వారిదగ్గరకు ఎందుకు వెళ్లటంలేదు? వెళ్లటానికి నీకు యిష్టంలేదా?"

వధువుకు మొదట సిగ్గనిపించింది. మళ్లా తలవంచుకొని "వెళ్లాలని వుంటోంది అక్కా! కాని వెళ్లగలిగితేగదా!" అన్నది.

"ఎందు కని ప్రతులా?"

"నీకు జ్ఞాపకం లేదూ?"

"లేదే!"

"అరే, నువ్వు మరచిపోయావా ఏమిటె అక్కా, నాది రాక్షసగణం, వారిది నరగణమైన సంగతి."

"ఎవరన్నారు?"

"వారే, మేనత్తతో అన్నారు. అందుకని..."

సురమకు ఒక్కసారి ఒళ్లంతా కంపించిపోయింది. "అది వట్టి అబద్ధం వదినా?" అన్నది.

"అబద్ధమా?"

ఆమె సురమ మొహంకేసి కళ్ళప్పళించుకొని చూస్తూ వుండిపోయింది. సురమ శరీరం మాటిమాటికీ కంపించసాగింది; "అబద్ధం! వట్టి అబద్ధం" అన్నది.

"వారు అబద్ధమాడతారని నాకు నమ్మకం కలగటం లేదు."

సురమ ఇక సహించలేకపోయింది. రెండుచేతులతో ఆమెను గట్టిగా కౌగిలించుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. "నేను మహాపాతకిని వదినా!"

వధువు కౌగిలినుండి వదిలించుకొని 'ఎందుకని అక్కా?' అన్నది.

"ఇప్పుడు దాన్ని వినవద్దు, నేను చెప్పలేను."

* * *

సురమ సుడిగాలిలాగ యజ్ఞదత్తుని ఎదుటకు వచ్చి "వధువును ఈ విధంగా మోసంలో వుంచావా? నువ్వెంత భయంకరమైన అబద్ధాలకోరువు!" అన్నది.

యజ్ఞదత్తుడు స్తంభించిపోయాడు.

"అదేమిటి సురమా?"

"ఛీ! ఛీ! నీకేం సిగ్గుగా లేదూ?"

యజ్ఞదత్తుడు దాని అంతరార్థం తెలుసుకోలేక కటువాక్యాలుమాత్రం వినసాగాడు.

"ఏ మనుకుని పెండ్లిచేసుకున్నావు? ఏమి ఆలోచించు

కొని ఆమెను వదిలిపెట్టి వచ్చావు? నా కోసమా? నా మొహం చూచి ఈ విధంగా మోసగించుతూ వస్తున్నావా?"

"పిచ్చిదాని వైపోయావా ఏమిటి సురమా?"

"పిచ్చిదాన్ని నేనా? నీకంటే నాకు ఎక్కువ జ్ఞానముంది... అయితే నన్నెక్కడికైనా పంపించు" అంటూవుండగానే సురమ కళ్ళల్లో నీరు తిరిగినై. రొప్పుతూ "ఇక ఒక్క రోజు కూడా వుండదలచుకోలేదు. ఛీ! ఛీ!..." అన్నది.

యజ్ఞదత్తుడు బిగ్గరగా అఱచి "ఏమంటావు?"అన్నాడు.

"నువ్వు మోసకారివి, అబద్ధాలకోరువి అంటున్నాను."

నిమిషంలో యజ్ఞదత్తుని మస్తిష్కంలో జ్వాలలా రగిలింది. కారణరహితంగానే అతని అంతరాత్మ బైటికి వచ్చి తన్ను యుద్ధానికి దింపుతూ వుందనిపించింది. జ్ఞానశూన్యుడై అతను టేబులు మీద వున్న రూళ్ళకర్ర తీసుకొని బిగ్గరగా "నేను అధముణ్ణి! నీచుణ్ణి! మోసకారిని! అబద్ధాలకోరుని! ఇది దానికి ప్రాయశ్చిత్తం" అని అరుస్తూ యజ్ఞదత్తుడు సత్తువ కొద్దీ నెత్తిమీద ఒక్కదెబ్బ కొట్టుకున్నాడు. తలపగిలి బొట బొట రక్తం కారసాగింది. సురమ అస్ఫుటస్వరంతో "అన్నయ్యా!" అని స్మృతి తప్పి కిందపడిపోయింది. యజ్ఞదత్తుడు అదిచూచాడు. తనమొహమంతా రక్తంతో తడిసి వుండటం కూడా కనపడింది. రక్తంకళ్ళల్లోకి వెళ్లటంమూలాన అంతా మసకగా కనపడుతూవుంది. అతను వున్మత్తుడిలాగ "ఇప్పుడెందుకు?" అనసాగాడు. ఇంతలో వెనకనుంచి ఎవరో వచ్చి పట్టుకున్నారు.? వెనక్కి తిరిగి చూచాడు. భార్య ఏడుస్తూంది. "నువ్వు వచ్చావా?" అన్నాడు.

భుజంమీద తలపెట్టి ఆమెకూడ స్మృతి తప్పి పడి పోయింది.

సురమ ఆవేశంతో కిందినుంచి పైకి పరుగెత్తుకు వచ్చి నప్పుడు వధువు ఆశ్చర్యంతోనూ, సందేహంగానూ ఆమె వెనుకనే వచ్చి బైట తలుపువద్ద నుంచుని అన్నిమాటలూ విన్నది. అంతా చూచింది. నిజం చాలవరకు సూర్యకాంతిలా ఆమె హృదయంలో స్పష్టమైపోయింది. ఆమె ఒంటెగూడా కొట్టుకో సాగింది. కళ్ళముందు మైకంలాగ కమ్ముసాగింది. కొంత తమాయించుకొని ఈ ఆపదసమయంలో పతిని వళ్లోకి తీసుకుంది.

౯

ఆరురోజుల తరువాత సురమకు బాగా తెలివివచ్చిన మీదట "అన్నయ్య ఒంట్లో ఎలావుంది?" అని అడిగింది.

"బాగానే వుంది" అని దాసీ జవాబు చెప్పింది.

"నేను చూచి వస్తాను" అంటూ సురమ లేచింది, కాని మళ్లీ పడిపోయింది. "మీ రింకా చాలా బల హీనంగా వున్నారు. జ్వరంకూడా వస్తూవుంది. లేవవద్దని డాక్టరు చెప్పి పోయాడు" అన్నది దాసీ.

యజ్ఞఅన్నయ్య చూట్టానికి వస్తాడు, వదిన వస్తుం దని ఆశించింది సురమ. ఒకరోజు, రెండురోజు లంటూ వారం రోజులు గడచిపోయినా ఎవరూ రాలేదు, ఎవరూ అజకూడ తీసుకోలేదు.

జ్వరం ఇప్పుడు రావటంలేదు. కాని బలహీనంమాత్రం బాగా వుంది. లేవటానికి ప్రయత్నిస్తే లేవగలిగేది. కాని అభి

మానకారణంగా లేవటానికి ఆమె మన స్సిచ్ఛగించ లేదు. ఆమె లోలోన కుమిలి కుమిలి ఏడ్వసాగింది. మళ్ళీ కళ్లు తుడుచుకుని తన ప్రకాశ్, ఛాయల కథను గురించి ఆలోచించేది.

ప్రదీప్తమైన ప్రకాశం, ప్రగాఢమైన ఛాయతో వారు ఆట ప్రారంభించారు. ఇప్పుడా ప్రకాశం క్షీణిస్తూ వుంది. మధ్యాహ్నసూర్యుడు పడమటి వైపుకి వాలాడు. అందుచేత ఆ ప్రగాఢచ్ఛాయ విస్తృతమై ప్రేతరూపం దాల్చి అస్పష్టమై పోయింది. అజ్ఞాతాంధకారంలో లీనమైపోవటానికా అన్నట్టు మెల్ల మెల్లగా జరిగిపోతూ వుంది. ఏడ్చి ఏడ్చి సురమ నిద్ర పోయింది.

ఒంటిమీద వెచ్చని చేయివేసి ఎవరో 'అక్కా!' అని పిలిచారు.

సురమ లేచి కూర్చుని "ఇదేమిటి వధూ?" అన్నది.

ఆమెకళ్లు ఎర్రనిప్పులైనాయి, మొహం వాడి పోయింది.

"ఏమిటి వధూ, నీ కేమైం దేమిటి?" సురమ మళ్ళా అడిగింది.

"నా కేమైంది? నువ్వు నన్ను ఈ ఇంటికి తీసుకొచ్చావు. అందుచేత నాకు సెలవిప్పించ మని చెప్పటానికి వచ్చాను అక్కా! నేను వెళతాను..."

"ఏమిటి వధూ? ఎక్కడికి వెళతావు?"

నూత్నవధువు సురమ పాదాలమీద శిరసువుంచి క్రింద పడింది.

ఆమె ఒళ్లు నిప్పులాగ మండిపోవటం చూచి సురమ "ఇదేమిటి? నీకు జ్వరం మంటలుమండుతూ వచ్చిందే"

అన్నది. ఇంతలో దాసీది అరుస్తూ పరుగెత్తుకు వచ్చి "అమ్మగారెక్కడికి వెళ్లారు అమ్మా! జ్వరతీవ్రతలో పరుగెత్తుకు వచ్చింది. ఇవ్వాళకి వారంరోజులనుంచి తెలివిలేకుండా పడి వుంది. ఇక్కడికి ఎలా వచ్చిందమ్మా!" అన్నది.

"వారం రోజుల నుంచి జ్వరమా? డాక్టరు వచ్చి చూస్తున్నాడా?"

"ఎవరూ వచ్చి చూట్టంలేదు అమ్మగారూ! మొన్న ప్రొద్దుటివరకూ కూడా ఎంత చెప్పినా వినకుండా గంటల కొద్దీ పంపుకింద కూర్చుంది."

*　　*　　*　　*

ప్రొద్దు కుంకకముందు సురమ యజ్ఞదత్తుని గదిలోకి వెళ్లి "వధువు ఇక జీవించటం కష్టం అన్నయ్యా!" అని ఏడ్చింది.

"జీవించటం కష్టమైతే ఏం చేయను?

నా గదిలోకి వచ్చి చూడు అన్నయ్యా! వధువు ఇక దక్కటం కష్టం."

ఇద్దరు ముగ్గురు డాక్టర్లు వచ్చి "బాగా వాతంకమ్మింది" అని తెల్లవార్లూ నిష్ఫలపరిశ్రమ చేసి తెల్లవారగానే వెళ్లిపోయారు.

రాత్రి తెల్లవార్లు యజ్ఞదత్తుడు తలవైపున కూర్చుని ఎన్నిసార్లు మొహందగ్గిర మొహం తీసుకెళ్లి పెట్టినా ప్రతుల పతిని గుర్తించలేకపోయింది.

డాక్టర్లు వెళ్లిపోయిన తర్వాత యజ్ఞదత్తుడు ఏడుస్తూ "ఒక్కసారి కన్నెత్తి చూడు ప్రతులా! క్షమించానని ఒకసారి అను" అన్నాడు.

ఆమె తన గుడిసెముందు తోటలో వంకాయలు కోసుకుని అమ్మకు రావటానికి సంతకు వెళుతూవుంది. ఈ దృశ్యం కళ్ల బడేప్పటికి ముందుకు అడుగువెయ్యలేక పోయింది. ఆమె సంతకు వెళ్లటం అటుంచి – పయట చెంగు మూటకు కట్టిన వంకాయలు పయటచెంగునే వుండి పోయినాయి – కన్నీరు తుడుచుకుంటూ ఆమెకూడా అందరికంటే వెనక స్మశానానికి చేరింది. స్మశానం వూరుబైట గరుడనదిఒడ్డున వుంది. అక్కడ కట్టెలు, గంధపుచెక్కలు, ఘృతం, ……… మొదలైన అంత్యకర్మోపకరణా లన్నీ అంతకు ముందే సంచితమై వున్నాయి. కంగాలు తల్లి హీనజాతి స్త్రీ అవటం మూలాన దగ్గరకు వెళ్లటానికి ధైర్యం చాలకపోయింది. ఒక ఎత్తయిన గట్టుమీద దూరంగా నుంచుని అంత్యక్రియలు ఆద్యంతం కుతూహలదృష్టితో చూస్తూవుంది.

శవాన్ని చితిమీద పెట్టినపుడు పాదాల పారాణీలు చూచి ఆమెకు కనుల పండువై పోయింది. పరుగెత్తుకు వెళ్లి ఆమె పాదాల పారాణితీసి తన నొసట పెట్టుకోవా లనిపించింది. హరిభజనల కలకల ధ్వనులలో జ్యేష్ఠపుత్రుని చేతి మంత్రపూతాగ్ని తల్లి చితి జ్వాల లెత్తించేప్పటికి ఆమెచెక్కిళ్ల వెంట కన్నీటిధారలు కారసాగినై – "మహాభాగ్యవతీ! నువ్వు స్వర్గానికి వెళుతున్నావు. నాకు కూడా కొడుకుచేతి అగ్ని సంప్రాప్త మయ్యేట్టు ఆశీర్వదించు తల్లీ!"అని మనసులో మాటి మాటికీ అనుకోసాగింది. కొడుకుచేతి అగ్గా! అది సామాన్య విషయ మేమీ కాదు. పతి, కొడుకులు – కూతుళ్లు బంధువులు – మిత్రులు, దాసదాసీలు ఇరుగుపొరుగు వారందరి సమక్షాన జరుగుతున్న స్వర్గారోహణం చూచి ఆమె హృద

యం నక్కౖ పో సాగింది; ఆ అదృష్టానికి అంతులేనట్టు చితి మీదినుంచి వస్తున్నపొగ ఆకాశంకేసి తొందరగ ఎగిరి పోతూవుంది. కంగాలు తల్లికి దానిలో ఒకచిన్న రథాకారం స్పష్టంగా కనపడ్డట్లు తోచింది. దాని నలువైపుల ఎన్నో చిత్రాలు చెక్కివున్నాయి. శిఖరం మీద రకరకాలైన ఆకులు, లతలు అమర్చివున్నాయి. దానిలోపల ఎవరు కూర్చున్నారో ఆనవాలు తెలియటంలేదుగాని, మొహాన సిందూర రేఖలు, పాదాలకు పారాణీలు స్పష్టంగా కనబడు తున్నాయి. పైవంక చూస్తూవుండగానే కంగాలు కళ్లల్లో నీళ్లు తిరిగినై. ఇంతలో ఒకపధ్నాలుగు-పదిహేనేళ్ల కుర్రవాడు వచ్చి ఆమె పయిట చెంగులాగుతూ "ఇక్కడ నుంచున్నావేం అమ్మా? అన్నం వండవూ?" అన్నాడు.

తల్లి త్రుళ్లిపడి అతని వంక తిరిగి చూచి "వండుతా లేరా!" అన్నది. తర్వాత వ్రేలితో పైకి చూపించి వ్యగ్ర స్వరంతో "చూడు నాయనా! బ్రాహ్మణ అమ్మగారు రథం మీద ఎక్కి స్వర్గానికి వెళుతున్నారు" అన్నది.

కుర్రవాడు ఆశ్చర్యంతో తలెత్తి "ఎక్కడ?" అని పరకాయించి చూచి "నువ్వు పిచ్చిదానివై పోయావా ఏమిటి అమ్మా! అది పొగ" అన్నాడు. తర్వాత కోపగించుకొని "రెండు ఝాములైంది. నాకు ఆకలెయ్యదనుకున్నావా ఏమిటి?" తల్లి కన్నీళ్లు చూచి "బ్రాహ్మణ అమ్మవారు చని పోతే నువ్వు ఏడుస్తావెందుకు అమ్మా?" అన్నాడు మళ్లా.

ఈ మాట వినేప్పటికి కంగాలు తల్లికి తెలివివచ్చింది. ఇతరులకోసం ఇలా స్మశానంలో నిలబడి కన్నీరు కార్చటం తలచుకునేప్పటికి ఆమెక్కూడా మనసులో చాల సిగ్గుకలిగింది

కొడుకుకి అశుభం కలుగుతుందనే సందేహంతో మరుక్షణమే కన్నీరు తుడుచుకొని నవ్వుమొహంతో "ఎందుకు ఏడుస్తానురా! కళ్ళల్లోకి పొగపోయింది. అందుచేత నీళ్ళు వస్తున్నాయి." అన్నది.

"పొతే పోయివుండవచ్చు కాని నువ్వు నిజంగా ఏడుస్తూ వుంటేనా?"

తల్లి ఇంకే ప్రతిసమాధానం చెప్పకుండా కొడుకు చెయ్యి పట్టుకొని రేవుకు వెళ్లి స్నానంచేసి కొడుకు చేత చేయించి ఇంటికి తిరిగి వచ్చింది. స్మశానసంస్కారం చివరివరకు చూచే భాగ్యం ఆమెకు లభించలేదు.

౨

బిడ్డల నామకరణం విషయంలో తలిదండ్రుల మూర్ఖత్వం చూచి విధాత అంతర్యంలో వుండి తరుచు పరిహాసిస్తూ వుంటాడు. అందుచేత వారు తమ జీవితమంతా, మరణాసన్నమయ్యేవరకు ఆ పేరుకోసమే పెనుగులాడుతూ వుంటారు. కాని కంగాలు తల్లి జీవితం ఈ విధాత పరిహాసానికి గురి కాలేదు. ఆమె పుట్టిన మరుక్షణమే తల్లి దేహం చాలించింది. తండ్రికి కోపం వచ్చి ఆమెకు 'అభాగిని' అని పేరు పెట్టాడు. తల్లి లేదు, తండ్రి ప్రొద్దెల్లపాదీ నదిలో చేపలు పట్టుకుంటూ వుండేవాడు. అందుచేత ఆమెకేసి కన్నెత్తి చూచే అవకాశమే వుండేదికాదు, అయినా ఆ చిన్న అభాగిని కంగాలుకు తల్లి కావటానికి బ్రతికి వుంది. ఆమెను పెండ్లాడిన వాని పేరు రసికబాఘ్. ఆ బాఘ్‌కి మరోభాగిని కూడా వుంది. అతను ఆమెను తీసుకొని మరోగ్రామం వెళ్లిపోయాడు. అభాగిని తన

దార్భాగ్యాన్ని, కంగాలీని వెంటబెట్టుకొని ఆవూళ్లోనే వుండి పోయింది.

ఆమె కంగాలి ఇవ్వాళ పెద్దవా డయ్యాడు. పదిహేనేళ్లు వచ్చాయి. ప్రస్తుతం కొంత కాలాన్నుంచి అతను పేముపని నేర్చుకుంటున్నాడు. ఇంకో ఏడాదిపాటు ఈ అభాగ్యునితో వేగగలిగితే తన దుఃఖం దూరం కావచ్చని అభాగిని ఆశపడ సాగింది. ఆమె దుఃఖం ఎలాంటిదో, ఏమిటో చూచేవాళ్లకు తప్ప ఇంకెవరికీ తెలియదు.

కంగాలి చెరువులో మొహం కడుక్కువచ్చి చూచేప్ప టికి తల్లి తనకు పెట్టగా మిగిలిన అన్నం ఒక కుండలో పెట్టి మూతవెయ్యబోతోంది. అతను ఆశ్చర్యంతో "నువ్వు తిన లేదా అమ్మా?" అని అన్నాడు.

"వేళ మిగిలిపోయింది నాయనా, ఇప్పుడు ఆకలిగా లేదు" అన్నది తల్లి.

కొడుకు నమ్మలేదు "అవును, ఆకలిగాలేదు. కుండ ఏది? చూస్తాను? అన్నాడు.

ఈ వంకతో తల్లి అతన్ని చాల రోజులనుంచి మోస పుచ్చుతూవుంది. అందుచేత అతను ఇవ్వాళ కుండచూచిగాని వదిలిపెట్టలేదు. దానిలో ఇంకొకరికి సరిపడ అన్నంవుంది. అప్పు డతను వికసితవదనంతో తల్లినళ్లోకి వెళ్లి కూర్చున్నాడు. ఈ ఈడుపిల్లలు సాధారణంగా అలా చెయ్యరుగాని చిన్నప్పటి నుంచీ రోగగ్రస్తు డవటం మూలంగా తల్లిఒడి తప్ప బైట స్నేహి లతో ఆడుకునే అవకాశం అతనికి దొరకలేదు. ఇక్కడ కూర్చునే అతను ఆటపాటల ఆనందాన్ననుభవించాడు. తల్లి మెడమీద చెయ్యివేసి ఆమె మొహం దగ్గర మొహం పెట్ట

గానే త్రుళ్లిపడ్డాడు. "నీవళ్లు వెచ్చగా వుంది, ఎండలో శవాన్ని కాల్చటం చూస్తూ నుంచున్నా వెందుకు అమ్మా! మళ్లీ వెళ్లి స్నానంచేశావా? శవాన్ని కాల్చటం... ..." అన్నాడు.

తల్లి చప్పున కొడుకు నోరుమూసి "ఛీ! శవాన్ని కాల్చటం అనకూడదు నాయనా! పాపం! సతీమతల్లి, లక్ష్మి, మహారాణి రథం ఎక్కి స్వర్గానికి వెళుతూవుంది" అన్నది.

"నీ దగ్గరవున్నది అదే! రథం మీద ఎక్కి ఎవరైనా స్వర్గానికి వెళతారా?" కొడుకు సంశయంతో అడిగాడు.

"నేను నా కళ్లార చూచాను నాయనా! బ్రాహ్మణ అమ్మవారు రథంమీద కూర్చునివుంది. ఆమె ఎర్రనిపాదాలు అందరికీ కనపడ్డాయి" అన్నది తల్లి.

"అందరికీ కనపడ్డాయా?"

"ఆఁ అందరికీ కనపడ్డాయి."

కంగాలి తల్లి హృదయాన్ని హత్తుకొని ఆలోచించ సాగాడు. తల్లిమాట నమ్మటం అతను చిన్నప్పటినుంచీ నేర్చుకున్నాడు. అలవాటువుంది కూడాను. తల్లి ఇలాంటి మహాఘటనను కళ్లార చూచానంటున్నప్పుడు ఎలా నమ్మకుండా వుంటాడు? కొంచెంసేపున్న తర్వాత మెల్లగా "అయితే నువ్వు కూడా స్వర్గానికి వెళతావా అమ్మా? ఆరోజున బిందుతల్లి రాఘవ మేనత్తతో 'కంగాలి తల్లిలాంటి సతీలక్ష్మి మాలల్లో ఎవరూలేరు అంటూవుంది" అన్నాడు.

కంగాలితల్లి మౌనంగా వూరుకుంది. కంగాలి అలాగే మెల్లగా "బాబు నిన్ను వదిలిపెట్టినపుడు మళ్లీ పెళ్లిచేసుకోమని నీ కెంతమంది ప్రోత్సాహం యిచ్చారు. నువ్వు ససేమిరా అని "కంగాలి వున్నంతవరకు నా కే చింతా లేదు. ఇంకా

పెళ్లి ఎందుకు చేసుకుంటాను?" అన్నాడు. అయితే అమ్మా! నువ్వు పెళ్లి చేసుకుంటే నే నే మయ్యే వాణ్ణి? తిండి పెట్టే వాళ్లు లేక మాడి చచ్చేవాణ్ణి."

తల్లి రెండు చేతులతో కొడుకును గట్టిగా హృదయానికి వత్తుకుంది. నిజం, ఆమెకు ఆరోజున అలాంటి సలహా నిచ్చిన వారికి తన్నూ వేమీ లేదు. దాని కే విధంగానూ అంగీకరించకపోయేప్పటికి జరిగిన గల్లంతుకూడా తక్కువకాదు. ఆ విషయం తలచుకొని అభాగిని కళ్లల్లో నీరు తిరిగినై. కొడుకు చేత్తో తల్లి కన్నీరు తుడుస్తూ "కంబళి వెయ్యనా? పండుకుంటావా అమ్మా?" అన్నాడు.

తల్లి మాట్లాడలేదు. కంగాలి చాప పరచి, దానిమీద కంబళి వేశాడు. బల్లమీద నుంచి దిండు తీసుకొచ్చి తల్లి చెయ్యి పట్టుకొని దానిమీద పండుకోబెట్టటానికి లాక్కెళ్ళేటప్పటికి "ఇవ్వాళ నువ్వు పనికి వెళ్లవద్దులే వుండు నాయనా" అన్నది తల్లి.

పనికి నాగా చెయ్యమన్న ప్రస్తావన కంగాలికి చాలా నచ్చింది. "మిఠాయి కొనుక్కోటానికి ఒక అర్ధణా యివ్వవు అమ్మా!" అన్నాడు.

"లేములే, రా! నీకు కథ చెబుతాను"

ఇంకెక్కువ ఆశ పెట్ట నవసరం లేకపోయింది. కంగాలి తక్షణమే తల్లి హృదయానికి అంటుకుపోయి "చెప్పు అమ్మా! రాజకుమారుడు, మంత్రి కుమారుడు - ఆ కీలు గుఱ్ఱము..." అన్నాడు.

అభాగిని రాజకుమారుడు, మంత్రి కుమారుడు, కీలు గుఱ్రమూ కథ మొదలుపెట్టింది. ఇదంతా అతను చాలసార్లు

విన్నదే. ఆమె చెప్పినకథే. కానీసేపట్లో ఆ రాజకుమారుడే మయ్యాడో, మంత్రి కుమారుడెక్కడికి వెళ్లాడో ఇతరులవల్ల నేర్చుకోని తన స్వకల్పితమైన మరో క్రొత్త కథ ప్రారంభించింది.

తల్లి జ్వరం ఎక్కువైనకొద్దీ తలలోని రక్తపుపోటు కూడా వృద్ధి కాసాగింది. క్రొత్త క్రొత్త కథలు ఇంద్రజాలాలు పన్నినకొద్దీ అతను భయ, విస్మయ, ఆవేశాలతో తల్లి వడిలో దూరిపోయేవాడు!

బైట—సూర్యుడు అస్తమిస్తున్నాడు. సూర్యుడు అస్తమించగానే సంధ్యాకాలపు మలిన ఛాయలు క్రమక్రమంగా దట్టం కాసాగినై. కాని ఇంట్లో ఇవ్వాళ ఎవరూ దీపం వెలిగించలేదు. గృహస్థ కర్తవ్యాన్ని నెఱవేర్చటానికి ఇవ్వాళ ఎవరూ లేవలేదు. నిబిడాంధకారంలో రోగిష్టి తల్లి బాధా విహీన గుంజనం మాత్రం నిస్తబ్ధపుత్రుని చెవులలో అమృతం వర్షిస్తూపోయింది. ఆ స్మశానం, ఆ స్మశానయాత్రా గాథే అది. ఆ రథమే, పారాణీలతో ఎరుపైన ఆ పాదాలే–ఆమె ఆ స్వర్గానికి వెళ్లటమే... ...! శోకవిహ్వలపతి అంతిమ పాదధూళి తీసుకొని దుఃఖిస్తూ ఏ విధంగా సెలవు తీసుకున్నాడో, హరి భజనలలో కొడుకులు ఎలా ఆమెను తీసుకెళ్లారో, ఆ తరువాత జ్యేష్ఠపుత్రుని చేతి అగ్ని... మొదలైన గాథంతా చెప్పి "ఆ అగ్ని అగ్నికాదు నాయనా! హరి రూపం. ఆకాశమంతా కమ్ముకున్న ఆ పొగ పొగకాదు నాయనా, అది స్వర్గరథము. కంగాలీచరణ్, మా బాబూ!" అన్నది.

"ఏమిటి అమ్మా?"

"నీ చేతి అగ్ని పెట్టించుకున్నానంటే నేను కూడా బ్రాహ్మణ అమ్మవారిలాగ స్వర్గానికి వెళతాను నాయనా!"

కంగాలి అస్ఫుటస్వరంతో, "ఛో, అట్లా అనకు" అన్నాడు.

తల్లి అతనిమాట వినలేను కూడానేమో, ఆమె వేడి నిట్టూర్పు విడుస్తూ "అప్పుడు హీనజాతివార మని ఎవరూ కించనపరచలేరు, పేదల మని ఎవరూ అడ్డగించ జాలరు. అయ్యో! కొడుకుచేతి అగ్ని. . .రథం రాక తప్పదు!" అన్నది.

కొడుకు తల్లి మొహంమీద మొహం పెట్టి రుద్ధకంఠంతో "అలా అనకమ్మా! అలా అనకు. నాకు చాలా భయం వేస్తుంది" అన్నాడు.

"ఇంకోమాట విను కంగాలీ! నువ్వు ఒకసారి మీ బాబును తీసుకురావాలి. వారు అలాగే తన పాదధూళి నా శిరసున వుంచి సెలవు తీసుకుంటారు. అలాగే పాదాలకు పారాణీలు . . . నొసటను సింధూరం . . . . . . కాని ఇవన్నీ ఎవరు తీసుకువస్తారు నాయనా? నువ్వు చేస్తావా చెయ్యవా కంగాలీ? నువ్వే నా కొడుకువి, నువ్వే నా కూతురివి, నువ్వే నా సర్వస్వం" అంటూనే ఆమె కొడుకును మళ్లా ఒకసారి హృదయానికి గట్టిగా వత్తుకుంది.

3

అభాగిని జీవన్నాటకంలో చివరి అంకం సమాప్త మవ్వబోతూ వుంది. దాని అస్తిత్వం ఇంక ఎక్కువ లేదు. దాపుకు వచ్చింది. ఇప్పటికి ముప్పైఏళ్ళు దాటినాయో లేదో. వూళ్లో వైద్యు డెవరూ లేరు. పక్కవూళ్లో ఒకడు వుంటున్నాడు. కంగాలి అతనిదగ్గరకు వెళ్లి పడ్డాడు, విలపించాడు. కాళ్లా వేళ్లా

పడి ప్రార్థించాడు. కాని అతను కదలలేదు. చివరికి ఒకగ్లాసు తాకట్టుపెట్టి ఒక రూపాయి తీసుకెళ్లి యిచ్చాడు. అతను రాకుండానే నాలుగైదు మాత్రలిచ్చి పంపించాడు. ఇంకా దానికి అనుపాన మెంత! అల్లపురసము, తులసి పసరు, తేనె . . . ఇది చూచి కంగాలితల్లి కొడుకుమీద కోపగించుకొని "నన్ను అడగకుండా గ్లాసు ఎందుకు తాకట్టు పెట్టి వచ్చావురా?" అని ఆమె ఆ మాత్రలు తీసుకొని పొయిలోకి విసరిపారేసింది. "బ్రతికితే ఇలాగే బ్రతుకుతాను. మందూ - మాకూ ఇచ్చి ఎవరినీ బ్రతికించలేము" అన్నది.

రెండు మూడు రోజులు ఇలాగే గడచిపోయినాయి. ఇరుగుపొరుగువారు ఈ కబురు విని చూట్టానికి వచ్చారు. దుప్పికొమ్ము అరగదీసి పొయ్యమని ఒకరూ, గవ్వ కాల్చి తేనెలో కలిపి యివ్వమని ఒకరూ . . . ఇలా ఎవరికి తోచిన వైద్యం వారు చెప్పి ఎవరి దారిన వారు చక్కా పోయారు. కొడుకు కంగాలి గాబరా పడేప్పటికి తల్లి అతన్ని దగ్గరకు తీసుకుని "వైద్యుని మందులవల్లే ఏమీ కాలేదు, ఈ మందులవల్ల ఏమౌతుంది నాయనా? నాకు ఇలాగే నయమౌతుందిలే" అన్నది.

కంగాలి ఏడుస్తూ "నువ్వు మాత్రలు వేసుకోకుండా పొయ్యిలో పారేస్తే నయమౌతుందా అమ్మా?" అన్నాడు.

"నాకేం పరవాలేదు. నయమౌతుందిలే నాయనా! సరే, నువ్వు కాస్త పొంగించుకు తిని రా!"

కంగాలి తన జీవితంలో ఇన్నాళ్లే మొదటిసారిగా వంట మొదలుపెట్టాడు. సరిగా వండను లేక పోయాడు. పొయ్యికూడా సరిగా వెలగలేదు. పొంగిపోవటం మూలాన పొయ్యంతా

తడిసిపోయింది. అన్నం పెట్టుకునేప్పుడు పళ్ళెం చుట్టూ పడి పోయింది ఇదంతా చూచి తల్లి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఆమె లేచి కూర్చోటానికి ప్రయత్నించింది, కాని తలకూడా ఎత్త లేక అలాగే పడివుంది. భోజన మదీ అయిపోయిన తర్వాత కొడుకును దగ్గరకు పిలచి – ఎలా వండుతారో, ఎలా వడ్డించు తారో ఈవివరాలన్నీ చెబుతూవుండగా మధ్యలో తలవని తలంపుగా ఆమె క్షీణ స్వరం ఆగిపోయింది. కళ్ళవెంట ఎడ తెరిపి లేకుండా కన్నీరు కారసాగినై.

ఆ ఊరి మంగలికి నాడి చూట్టం తెలుసు. మరుసటి రోజున అతను వచ్చి చూచి – ఒక నిట్టూర్పు విడచి వెళ్లి పోయాడు. కంగాలి తల్లి దీని అంతరార్థం గ్రహించింది, కాని ఆమె ఏమీ అధైర్యపడలేదు. అందరూ వెళ్లిపోయినమీదట కొడుకుతో "వారిని ఒకసారి పిలుచుకురాగలవా నాయనా!" అన్నది.

"ఎవరినమ్మా?"

"వారినేరా, ఆ ఊరు వెళ్లిపోయారే."

కంగాలి గ్రహించి "బాబునా?" అన్నాడు.

అభాగిని మాట్లాడలేదు.

"వా రెందుకు వస్తారు అమ్మా?" అన్నాడు కంగాలి.

అభాగనికి స్వయంగా కూడా చాల సందేహంగావుంది. అయినా "వెళ్లి, అమ్మకు మీ పాదధూళి కావాలం టని చెప్పు" అన్నది.

అతను లేచి వెళ్లబోతూ వుండేప్పటికి తల్లి మళ్లా అతని చెయ్యి పట్టుకుని కొంచెం కంటనీరు పెట్టి – అమ్మ వెళ్ళిపోతూ వుందని చెప్పు" అన్నది.

కొంచెం ఆగి "అటునుంచి తిరిగి వచ్చేటప్పుడు మంగలి వదినను అడిగి కొంచెం పసుపు, కుంకుమ తీసుకురా, నే నంటే ఆమెకు ఎంతో ప్రీతి. నే నడిగా నంటే యిస్తుందిలే" అన్నది మళ్లా.

ప్రీతి వుంది. దానిలో సందేహం లేదు.

తల్లికి జ్వరం వచ్చిన తరువాత కంగాలి ఈ మాటలు ఆమె నోటివెంట ఎన్నోసార్లు ఎన్నో విధాల విన్నాడు. అతను అక్కడనుంచే వణుకుతూ బైలుదేరాడు.

## ౪

మర్నాడు రసికుడు లేసమయానికి వచ్చినపుడు అభాగినికి అంత స్పృహ లేదు. మొహాన మృత్యుచ్ఛాయలు ఆవరించాయి. కంటిచూపు ఈ లోకపుకర్తవ్యాన్ని నిర్వర్తించుకొని ఏ అపరిచితలోకాని కెళ్లిందో అంతు లేదు. కంగాలి ఏడుస్తూ "బాబువచ్చాడు. అమ్మా, పాదధూళి తీసుకోవు!" అన్నాడు.

తల్లికి తెలిసిందో లేదోగాని చెప్పలేము కాని, ఆ మృత్యుపథయాత్రి తన దుర్బలహస్తాన్ని బైటకి జాపింది.

రసికుడు హతబుద్ధునిలాగ నుంచుని వుండిపోయాడు. లోకంతో తన పాదధూళికూడా అవసర ముంటుంది, తను కూడా ఎవరికైనా కావలసివుంటా నని అతను వూహించను కూడా లేదు. బిందుతల్లి కూడా దగ్గరేనుంచుని వుంది. "ఇవ్వు నాయనా, కొంచెం పాదధూళి చేతి కివ్వు" అన్నది.

రసికుడు ముందుకు జరిగాడు. తన జీవితంలో ఎప్పుడూ

ప్రేమించక అన్నవస్త్రాలివ్వకుండా వదిలిపెట్టిన స్త్రీకి అవసాన సమయంలో ఇవ్వాళ పాదధూళి నిస్తూ ఏడ్చాడు.

"ఇటువంటి సతీసాధ్వి, లక్ష్మి, బ్రాహ్మణ, కాయస్థ కుటుంబాలలో పుట్టక ఇక్కడ ఎందుకు పుట్టింది! ఇద్వాడామెకు కొంచెం సద్గతి కలిగించు నాయనా? కంగాలి చేతినిప్పుఆశతో పాపం ప్రాణాలు వదులుతూవుంది."

అభాగిని దౌర్భాగ్యదేవత అగోచరంగా కూర్చుని ఏమి ఆలోచించాడో తెలియదు కాని పాప మా పసికంగాలి హృదయాన్ని ఈమాట బాణంలాగ భేదించింది.

ఆ పగలంతా గడచిపోయింది. మొదటి రాత్రికూడా గడచింది. కాని కంగాలితల్లి వుదయంవరకు నిలవ లేక పోయింది. ఈ హీనజాతికి స్వర్గరథవ్యవస్థ వుందో లేదో, లేక పోతే చీకట్లో కాలినడకనే వెళ్లవలసివస్తుందో తెలియదు. కాని తెల్లవారకముందే ఈమె ఈ దేహాన్ని చాలించిం దని మాత్రం తెలుస్తూవుంది.

వారి గుడిశెముందు ఒక గానుగచెట్టువుంది. రసికుడు ఎక్కడినుంచో ఒకగొడ్డలి అడిగితెచ్చి దానిమీద వేటు వేశాడో లేదో – జమీందారుగారి నౌకరు వచ్చి అతన్ని ఒక లెంపకాయవేసి గొడ్డలి లాక్కుని "గాడిదకొడకా! నీ బాబుగాడి చెట్టుటరా కొడుతున్నావు?" అన్నాడు.

రసికుడు చెంప సవరించుకుంటున్నాడు. కంగాలి ఏడుపు మొహంతో "ఇది మా అమ్మ నాటిన చెట్టు! నువ్వు బాబును అనవసరంగా కొట్టింది ఎందుకు?" అన్నాడు

నౌకరు అతన్నికూడా అనరాని మాట లని కొట్ట బోయాడు. కాని అతను తల్లి శవందగ్గర కూర్చునివుండేప్పటికి

నైలతగులుతుం దనే భయంతో అంటుకో లేదు. ఆ గల్లంతుకు జనం పోగయ్యారు. రసికుడు అడగకుండా చెట్టుకొట్టటం తప్పే నని అందరూ ఒప్పుకున్నారు. కాని మళ్లా వారే నౌకరు కాళ్లూ వేళ్లూ పట్టుకొని చెట్టు కొట్టుకోటానికి అనుమతి యివ్వ మని వేడుకోసాగారు. కారణం — అభాగిని జబ్బులో వుండగా చూట్టానికి వచ్చినవాళ్లందరివద్దా తనకడసారి కోర్కె తెలిపింది.

కాని నౌకరు ఈ మాటలన్నీ వినేవాడుకాదు. అతను తలకాయ తిప్పుతూ "ఈ నక్కజిత్తు లన్నీ నావద్ద పనికిరావు" అన్నాడు.

జమీందారు స్థానికంగా వుండే మనిషి కాదు. ఊళ్లో అతనికి ఒక కచేరీ వుంది. గుమాస్తా అధర్ రాయ్ దానికి యజమాని. ఇరుగు పొరుగు నౌకరును బతిమాలుతూ వుండగా కంగాలీ కచేరీకి పరుగెత్తు కెళ్ళాడు. జమీందారీ ఉద్యోగస్తులు అన్యాయా న్నణచుతా రనుకున్నాడు. ఈ అత్యాచారాన్ని గురించి యజమాని చెవినిబడితే దాని కే దైనా ప్రతీకారం జరుగుతుం దని కూడా అనుకున్నాడు. ఓరి అజ్ఞానుడా! బెంగాలు జమీందారులను, వారి నౌకరులను అత నెరుగడు. పాప మా తల్లిలేని పసికాయ ఆవేశంతో ఒక్కసారి పైకి వెళ్లాడు—అధర్ రాయ్ అప్పుడే సంధ్యావందనం చేసి, ఫలహారం తీసుకొని బైటకొచ్చి కూర్చున్నాడు. విస్మయ క్రోధాలతో "ఎవరు?" అన్నాడు.

"నేను కంగాలీని. మీ నౌకరు మాబాబును కొట్టాడు."

"మంచిపని చేశాడు; గాడిదకొడుకు శిస్తు యివ్వ లేదేమో?"

"లేదు బాబుగారూ! మా బాబు చెట్టు కొడుతున్నాడు. మా అమ్మ చచ్చిపోయింది..." అంటూనే అతను దుఃఖా న్నాపుకోలేక ఏడ్చాడు.

ప్రొద్దున్నే ఈ ఏడుపు చూచి అధర్‌కి చాల కోపం వచ్చింది. కుర్రవాడు శవాన్ని అంటుకు వచ్చి ఇక్కడేమైనా అంటుకున్నా డేమో నని అతనికి భయ మేసింది. మండిపడి "తల్లి చస్తే కిందకు వెళ్లి నుంచో, ఎవర్రా అక్కడ, ఇక్కడ కొంచెం పేడకలాపి చల్లి పోండి. నువ్వేజాతి వాడివిరా?" అన్నాడు.

కంగాలి భయంతో కిందకు దిగి తలవాకిట్లోకి వచ్చి నుంచుని "మేము మాదిగవాళ్లము" అన్నాడు.

"మాదిగవాళ్లా! అరే! మాదిగవాళ్ల శవానికి కట్టె లెందుకురా?" అన్నాడు అధర్.

"మా అమ్మ నన్ను దహనం చెయ్యమని చెప్పి చని పోయింది. ఇం కెవరినైనా అడగండి బాబుగారూ! నా మాట అబద్ధమేమో! అందరితోనూ చెప్పింది." తల్లి సంగతులు చెబు తూవుండేప్పటికి క్షణంలో అతనికి దుఃఖం పొరులుకొచ్చింది.

"మీ అమ్మను దహనం చేయదలచుకుంటే చెట్టు ధర అయిదురూపాయలు తీసుకురా! తీసుకు రాగలవా?" అన్నాడు అధర్.

ఇది అసంభవ మని కంగాలీకి తెలుసు. తల్లికి వ్రుత్త రేయం కొనటానికి డబ్బులేక బిందు తల్లి తను అన్నం తినే పళ్లెం తాకట్టు పెట్టటానికి తీసుకెళుతూ వుంది. అతను కళ్లార చూచి వచ్చాడు. అతను తలకాయ తిప్పి "తేలేను" అన్నాడు.

అధర్ తన మొహాన్ని మరింత వికృతంచేసి తీసుకు

రాలేకపోతే మీ అమ్మను తీసుకెళ్లి ఏటివడ్డున పాతేసిరా. ఎవరి తాతగాడిసొమ్మని మీబాబు చెట్టుమీద చెయ్యి వేశాడురా, దొంగ వెధవా!'' అన్నాడు.

"అది మావాకిటిముందు చెట్టు బాబూ! దాన్ని మా అమ్మ చేతిమీదుగా పెంచింది'' అన్నాడు కంగాలీ.

"మీ అమ్మ చేతిమీదుగా పెంచిన చెట్టుటరా? ఈగాడి దను నాలుగుతన్ని మెడబట్టి బైటకి గెంటించు పాండా?''

పాండావచ్చి అతన్ని రెండుతన్ని మెడబట్టి గెంటుతూ జమీందారనౌకర్లుతప్ప ఇంకెవరూ అననిమాటలన్నీ అన్నాడు.

కంగాలి దులుపుకు లేచి నుంచుని మెల్లగా బైటకి వెళ్లి పోయాడు. అతను దెబ్బ లెందుకు తిన్నాడో, అతని తప్పే మిటో – పాపమా పసిహృదయాని కేమీ అర్థం కాలేదు.

గుమాస్తా కఠిన హృదయం మీద దీని ప్రభావమేమీ పడలేదు. పడినట్లయితే అతనికి ఈ నౌకరీ దొరికేదేకాదు. "వీడి తాలూకు సిస్తేమైనా బాకీవుందేమో చూడు పరేశ్! బకాయ వుంటే చెంబూ, తపాలా అన్నీ లాక్కురండి–గాడిద కొడుకు పారిపోతాడు'' అన్నాడు.

ముఖర్జీల ఇంట్లో శ్రాద్ధం. మధ్య ఒక్కరోజుమాత్రం కాళీ వుంది. ఏర్పాట్లన్నీ మహాట్టహాసంతో జరుగుతున్నాయి. వృద్ధ ఠాకూర్‌దాస్ పను లన్నీ స్వయంగా శ్రద్ధతో చేయించు తున్నాడు. కంగాలి అతని ఎదుటకు వచ్చి నుంచుని "మా అమ్మ చనిపోయింది బాబుగారూ!'' అన్నాడు.

"నువ్వెవరవు ? నీ కేం కావాలి?''

"నేను కంగాలిని. మా అమ్మ నాతో తన్ను దహనం చేయమని చెప్పి పోయింది''

"అయితే, చెయ్యి."

కచేరీలో జరిగిన ఘటనసంగతి ఊళ్లో మారుమూలలా వ్యాపించింది. ఒకతను వచ్చి "బహుశా ఏదైనా చెట్టు కావాలేమో" అని ఆ ఘట్టాన్ని చెప్పాడు.

ముఖర్జీ ఆశ్చర్యంతో "వీడి మాటలు వినండి. రేపూ ఎల్లుండికి మాకే కఱ్ఱ చాలకుండా వుంది. పో, పో, ఇక్కడేం కాదు" అన్నాడు.

భట్టాచార్యుడు దగ్గర్నే కూర్చుని జాపితా తయారు చేస్తున్నాడు. "మీ జాతిలో తగలెయ్యటం ఎప్పటినుంచిరా? పోయి నెత్తినకాస్త నిప్పువేసి ఏటివడ్డున పాతెయ్యి" అన్నాడు అతను.

ముఖర్జీగారి పెద్దబ్బాయి ఏదో పనిమీద అటువస్తూ – ఈ మాట విని "ఇప్పుడు అంతా బ్రాహ్మలూ, కాయస్థులూ కాబోతున్నారు పంతులుగారూ!" అంటూ వెళ్లిపోయాడు.

కంగాలీ ఇంకెవరి దగ్గరకూ వెళ్లి యాచించలేదు. ఈ రెండు గంటల అనుభవంతోనే ప్రపంచంలో అతను ఒక్కసారి వృద్ధుడై పోయాడు. మెల్లగా ఇంటికి తిరిగి వెళ్లిపోయాడు

నదిఒడ్డున గొయ్యితీసి అభాగినిని పండబెట్టారు. రాఘవ తల్లి కంగాలి చేతికి కాలుతున్న ఒక చిన్న కట్టె యిచ్చి తల్లి తలమీద పెట్టించింది. ఆ తర్వాత అంతా కలిసి మట్టితో కప్పి కంగాలి తల్లి అంతిమచిహ్నాన్నికూడా అంతులేకుండా చేశారు.

అంతా తమ తమ పనులలో మగ్నమైవున్నారు. కాని కంగాలి మాత్రం – మండుతున్న ఆచిన్నకట్టెలోంచి సుడులు తిరుగుతూ ఆకాశంకేసి పొగ కేసి ధ్యానంతో చూస్తూ స్తబ్ధుడై నుంచున్నాడు.

# బాల్యస్మృతి

నామకరణానికి సరైన లగ్నం కుదరలేదో, తాతగారికి జ్యోతిషశాస్త్రంలో విశేషజ్ఞానంలేదో, మరింకే కారణంచేతో గాని నా పేరు 'సుకుమార్' అని పెట్టారు. ఎంతోకాలం పట్టలేదు. నా పేరుకీ, నాకూ ఏమీ సంబంధంలేదని తాతగారు ఒకటి రెండేళ్ళలోనే గ్రహించారు. ఇప్పుడు నేను పన్నెండు, పదమూడేళ్ళనాటి సంగతి చెబుతున్నాను. నా ఆత్మ పరిచయవిషయాలన్నీ ఎవరికీ సరిగా తెలియకపోయినా... ...

వినండి; మేము పల్లెటూరివాసులము. చిన్నప్పుడు నేను అక్కడేవుంటూవచ్చాను. తండ్రిగారు పశ్చిమాన వుద్యోగం చేస్తున్నారు. నేను అక్కడికి వెళ్ళటం చాల అరుదు. అసలు లేదనుకోవచ్చు. నేను అమ్మమ్మగారింటివద్ద వూళ్ళోనే వుంటూవుండేవాణ్ణి. ఇంట్లో నా అల్లరికి అంతులేదు. ఒక్క మాటలో చెప్పాలంటే నే నొక చిన్నరావణాసురుడను అని చెప్పవచ్చు. ముసలితాత "నువ్వు ఎలా అయిపోయావురా ? ఎవరిమాటా వినటంలేదు, నానాఆగడం చేస్తున్నా వని మీ నాన్నకు ఇవ్వాళే వుత్తరం రాస్తాను వుండు" అంటే నేను కొంచెం నవ్వి "ఆ రోజులుపోయాయి తాతా ! నాన్నను అటుంచి, ఇక నాన్న తాతకుకూడ జడవను" అనేవాణ్ణి. అమ్మమ్మ దగ్గరవుంటే ఇంకెందుకు జడుస్తాను ? "ఎటువంటి సమాధానం వచ్చింది? ఇక వదిలిపెడతావా వాణ్ణి?" అని ఆమె అనేది తాతతో. తాతకు కోప మొచ్చి నాన్నకు వుత్తరం రాసిన మరు క్షణమే నల్లమందుడబ్బా మాయమయ్యేది. ఉత్తరం

చించి పారెయ్యనంతవరకు ఆయన డబ్బా చేతికొచ్చేదికాదు. ఏటన్నిటి భయంవల్ల ముఖ్యంగా నల్లమందు డబ్బా ఎక్కడ మాయం చేస్తానో అనే భయంవల్ల మళ్లీ నన్ను అదేమని అనేవాడు కాదు. నేనుకూడా చాలా దిలాసా పడేవాణ్ణి.

సుఖాలన్నిటికీ కూడా చివరకు ఒకపరిమితివుంది. నాకు కూడా అదే జరిగింది. తాతగారి పెత్తండ్రికొడుకు గోవింద బాబు అలహాబాదులో వుద్యోగం చేస్తూవుండేవాడు. ఇప్పుడు ఆయన పెన్షను తీసుకొని ఊళ్లోకి వచ్చివుంటున్నాడు. ఆయన మనుమడు శ్రీ రజనీకాంతుడు కూడా బి. ఏ. ప్యాసయి ఆయన వెంట వచ్చాడు. నేను అతన్ని 'అన్నయ్యా!' అని పిలుస్తూ వుండేవాణ్ణి. మొదట అతనితో నాకెక్కువ పరిచయంలేదు. వారు ఈవైపున చాల అరుదుగా వస్తూవుంటారు. ఇల్లుకూడా వేరే వుంది. ఎప్పుడైనా వచ్చినా నాయందు అంత ధ్యాస ముంచేవారు కాదు. ఎప్పుడైనా ఎదురుపడితే 'ఏమిరా, ఏమి చదువుతున్నావు?' అని ఇంతకు తప్ప ఇంకేం అడిగేవారు కాదు.

ఈసారి వచ్చిన తర్వాతనుంచి వారు నాయందు ధ్యానం ఎక్కువ చేశారు. రెండురోజుల సంభాషణతోనే ఆయన నన్ను పూర్తిగా వశంచేసుకున్నారు. ఆయన్ను చూడగానే నాకు గుండె దడదడలాడేది; మోహం వాడి పోయేది. ఏదో అపరాధం చేసినట్టు — దాని కెంత శిక్షవిధించు తారో నని వణకిపోయేవాణ్ణి. నేనారోజుల్లో తరచు అల్లరి చేస్తున్న దానిలో మాత్రం సందేహం లేదు. ఎప్పుడూ ఏదో ఒక అల్లరి చేస్తూనే వుండేవాణ్ణి. అది లేకపోతే నాకు శాంతి ఎక్కడ?

ఇంత భయపడినప్పటికీ అన్నయ్యను నేను చాల

ప్రేమిస్తూ వుండేవాణ్ణి. అన్నదమ్ముల మధ్య ఇంత గౌరవ మర్యాద లుంటాయని నాకు అంతకుముందు తెలియదు. ఆయన కూడా నన్ను చాల ప్రేమిస్తూ వుండేవాడు. ఆయన ముందుకూడా నేను అనేక తప్పులుచేశాను. ఎంతో అల్లరి చేశాను. కాని ఆయనేమీ అనేవాడు కాదు. ఏమైనా అన్నా కొంచెం సేపుంటే ఆయనే మర్చిపోతాడు. జ్ఞాపకము వుండదు లే'' అనుకునేవాణ్ణి.

ఆయన తలచుకుంటే నన్ను బాగుపర్చేవారే; కాని ఆయ నేమీ చేయలేదు. ఆయన వూళ్లోకి వచ్చిన తర్వాత నేను మొదటిలాగ వశమై లేను; ఎలావున్నా కులాసాగా మాత్రం వున్నాను.

రోజూ తాత పొగాకు ఎత్తుకుపోయి కాల్చేవాణ్ణి. పాపం ముసలితాత నుంచంతలకిందనో, దిండుగలీబులోనో—ఇంకెక్కడెక్కడో దాచుకునేవాడు. నే నెట్లాగైనా వెకలించుకుపోయి కాల్చేవాణ్ణి. పుష్టిగా తిని తిరుగుతూ వుండేవాణ్ణి. ఏ యాతనాలేదు; ఏ చిక్కులూలేవు. చదువుసంధ్యలు ఒక విధంగా వదిలిపెట్టినట్టే అనుకో. తోటలోకెళ్ళి పిట్టల్ని కొడుతూ, వుడతల్ని చంపి కాల్చుకుతింటూ, అడవిలో కెళ్ళి కన్నాల్లో కుందేళ్ళను వెతుకుతూ తిరుగుతూవుండేవాణ్ణి. ఇదే నా పని. నా కెవరిభయం గానీ, చింతగానీ ఏమీలేదు.

నాన్నగారు బక్సర్‌లో వుద్యోగం చేస్తున్నారు. అక్కడనుంచి వారు నన్ను చూట్టానికి రాబోరు; కొట్టటానికీ రాబోరు. తాతముత్తవల సంగతి నేను మొదటే చెప్పాను. ఒక్కమాటలో-నేను హాయిగా వున్నా నని చెప్పవచ్చు.

ఒకరోజున మధ్యాహ్నం ఇంటికివెళ్లి అమ్మమ్మ నోటి

వెంట విందును గదా—నేను అన్నయ్యవెంట కలకత్తా చదువుకోటానికి వెళ్ళాలట. విశ్రాంతిగా పుష్టిగా భోంచేసి హుక్కా-నింపి తాత దగ్గరకువెళ్ళి—"నేను కలకత్తా వెళ్ళాలా? తాతా?" అన్నాను.

"అవును" అన్నాడు తాత.

ఇదంతా పన్నాగమని నేను మొదటే అనుకున్నాను. అందుకని "వెళితే ఇవ్వాళే వెళతాను" అన్నాను.

తాత నవ్వుతూ "దీనికి ఇంకా ఆలోచనెందుకు నాయనా? రజని యివ్వాళేవెళతాడు కలకత్తా; ఇల్లు కుదిరింది; ఇవ్వాళే వెళ్లాలి" అన్నాడు.

నేను మండిపోయాను. ఒకటి-ఆ రోజున తాత దాచుకున్న పొగాకు ఎంత వెతికినా దొరకలేదు. దొరికిన తునక ఒక్క-గుక్క-కు కూడా చాలలేదు. కాని నేను మోసపోయాను. నా అంతట నేను ఒప్పుకొని వెనక్కి-లా తగ్గనూ. నే నారోజునే కలకత్తా బైలుదేరవలసివచ్చింది. వెళుతూ తాత పాదాలు పట్టుకొని – 'నీ కర్మకి రేపే మళ్లా ఇంటికి తిరిగి వచ్చేట్టు చెయ్యి భగవంతుడా! ఆతర్వాత నన్ను కలకత్తా ఎవరు పంపుతారో చూస్తాను-" అనుకున్నాను మనసులో.

౨

కలకత్తారావటం నే నదే మొదటిసారి. ఇంత పెద్దపట్టణం నే నంతకుముం దెప్పుడూ చూడలేదు. నేను గంగానదిలో ఈదుతూ పోయి ఆక్రలవంతెన దగ్గర గుంపులోనో, ఓడల మధ్యకో – మళ్లా ఇంటికి తిరిగి వెళతానని ఆశవుందా అని

పించేది. కలకత్తా నాకేం బాగుండలేదు. ఇంత పెద్దసంతలో ఏవస్తువైనా బాగుంటుందా? బాగావుందని కూడా నేను నమ్మలేక పోయాను.

మా ఆ పేటివక్కు ఏమైంది! ఆ వెదురుపొదలు, పువ్వుల తీగెలు, మిత్రపరివారమూ-తోటమూల - ఆ జామచెట్టు—ఏమీ లేవు? ఇక్కడ పెద్ద పెద్ద భవంతులు, గుర్రపుబళ్ళూ, మనుష్యుల గుంపులూ, విశాలమైన వీధులూ కనపడుతున్నాయి. ఇంటివెనక ఒక తోటకూడా లేదు — చాటు మాటగా ఒక బీడీముక్క కాల్చుకోటానికి! నాకు ఏడుపు వచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుని - కాయానికి ఇచ్చినవాడే కథానికీ యిస్తాడు. సృష్టించిన భగవంతుడు-భోజనమివ్వ లేడూ? అనుకున్నాను మనసులో.

కలకత్తా వచ్చాను. స్కూల్లో చేరి బాగా చదువుతున్నాను. ఇప్పుడు నేను 'మంచి పిల్లవాడి' నయ్యాను. ఊళ్ళో తప్పకుండా నా పేరు మోగిపోతూ వుంటుంది. సరే, ఆ సంగతి పోనీ.

అన్నయ్య ఆత్మమిత్రులంతా కలిసి ఒక మెస్సు పెట్టారు. దానిలో మేము నలుగురమూ వుంటూ వుండేవాళ్ళము. అన్నయ్యా, నేనూ, రామ్‌బాబూ, జగన్నాథబాబూ. రామ్‌బాబూ, జగన్నాథబాబూ అన్నయ్య స్నేహితులు. వీరుగాక ఒక నౌకరూ, ఒక వంట బ్రాహ్మడూ వున్నారు.

గదాధరుడు (వంటబ్రాహ్మడు) నా కన్న మూడు నాలుగేళ్లు పెద్ద. అంత మంచి మనిషిని నే నంతకు ముందెప్పుడూ చూడలేదు. వీధిలో నే నే కుర్రాడితోనూ మాట్లాడనూ లేదు, స్నేహము చెయ్యలేదు. గదాధరుడు పూర్తిగా భిన్న

ప్రకృతి గల మనిషి. అయినప్పటికీ నాకు ఆంతరంగిక మిత్రు డై పోయాడు. నాకు అతనితో బాగా పొసగింది. ఎంత బాతా ఖానీ వేసేవాళ్లమో అంతులేదు. అతను మేదినీపూర్ జిల్లాలో ఒక గ్రామవాసి. అక్కడి సంగతులూ, అతని చిన్ననాటి చరిత్రా మొదలైనవి నాకు చాల నచ్చేవి. వాళ్ళ ఊరి సంగ తులు ఎన్నిసార్లు విన్నానో అంతులేదు. ఇప్పుడు నా కళ్లకు గంతలు కట్టి వదిలిపెట్టినా నేను వాళ్ల ఊరంతా తిరిగి రా గలను. ఆదివారంనాడు నే నతనివెంట కిలామైదానంలోకి షికారు కెళుతూ వుండేవాణ్ణి. సాయంత్రం వంటింట్లో కూర్చుని 'కోట్‌పీస్' ఆడుతూ వుండేవాణ్ణి. భోజనాదులైన తర్వాత అతని చిన్న హుక్కాతోనే ఇద్దరమూ పీల్చేవాళ్లము. పను లన్నీ మేమిద్దరం కలిసి జంటగా చేస్తూ వుండేవాళ్లము. వీధి ఇరుగుపొరుగు వా రెవరితోనూ నాకు పరిచయం లేదు. ఊళ్లో స్నేహితులు మిత్రులు, వెంకన్న, సుబ్బన్న – అంతా అతనే. అతని నోటివెంట నే నెప్పుడూ 'చిన్ననోట పెద్ద మాట' వినలేదు. అనవసరంగా అతన్నందరూ అవమాన పరుస్తూ వుండేవారు. దానికి నాకు మండుకుపోయేది. కాని అతను తన నోటితో ఎవరికీ ఎదురు చెప్పేవాడు కాదు–యథా ర్థంగానే తను దోషియైనట్టు.

అందరికీ భోజనాలు పెట్టిన తర్వాత అతను వంటింట్లో ఒకమూల వదిగి ఇత్తడి పళ్లెము దగ్గర కూర్చున్నప్పుడు నే నెన్ని పనులున్నా సరే వదిలిపెట్టి అక్కడికి హాజరయ్యేవాణ్ణి. అసలు వాడి రాతే అలాంటిది. చివర కతనికి ఏమీ మిగిలేది కాదు. ఒకొక్క రోజున అన్నంకూడా తక్కువయ్యేది. ఎవరు భోంచేస్తుండగానూ నేను వెళ్లేవాణ్ణికాదు, గాని నాకు

పప్పుగానీ, కూరగానీ, అన్నంగానీ తక్కువైనట్టు ఎప్పుడూ చూడలేదు. కాని అది చూచి నాకు చాల బాధగా వుండేది.

చిన్నప్పుడు మా అమ్మమ్మ నోటివెంట వింటూ వుండేవాణ్ణి. ఆమె నన్ను గురించి అంటూవుండేది. 'పిల్లవాడు కడుపు నిండా తినక ఎండి ముల్లయిపోతున్నాడు, ఎలా బ్రతుకుతాడు?' అని. కాని నేను అమ్మమ్మ అంటున్న 'పొట్టనిండా' ఎప్పుడూ తిన గలిగే వాణ్ణి కాదు. ఎండిపోయినా, ముల్లయిపోయినా నాకు ఆకడుపునిండా తినకుండా వుంటేనే బాగుండేది. ఆ కడుపు నిండా తినకపోవటంలోనూ ఈ కడుపునిండా తినకపోవటం లోనూ ఎంత భేదముందో నే నిప్పుడు ఈ కలకత్తా వచ్చిన తరువాత తెలుసుకున్నాను. కడుపునిండా కూడు లేకపోతే కళ్ళవెంట నీళ్ళు వస్తాయన్న విషయం నా కెప్పుడూ అనుభవం లేదు. ఇదివరకు నేను తాత పళ్లెంలో నీళ్ళు పోసి ఎన్నిసార్లు అన్నం దగ్గరనుంచి లేపానో అంతులేదు. అమ్మమ్మ మడి కట్టుకువస్తే ఆమెమీద కుక్కపిల్లను వేసి ఆమెచేత మళ్లా ఎన్నిసార్లు స్నానం చేయించానో లెక్కలేదు. కాని వా రే నాడూ కడుపునిండా తినకుండా వుండనూ లేదు, వారి కళ్లవెంట నీరూ రాలేదు. తాతా, అమ్మమ్మ, ఇంట్లోవారు, ఇంకానన్ను బాగా ప్రేమించే వారి కోసం నే నెప్పుడూ దుఃఖపడలేదు. ఇంకా పైగా వారిని అర్ధాకలితో వుంచితేనే నాకు పరమ సంతోషంగా వుండేది. మరి, ఈ గదాధరుణ్ణి చూడు — చుట్టమూకాదు, పక్కమూకాదు – అతనికోసం నా కళ్ళల్లో పిలవకుండానే కన్నీళ్ళు పరుగులెత్తుకు వచ్చేవి.

కలకత్తా వచ్చిన తర్వాత నాకిదేమిటో ఏమీ అర్థం కావటంలేదు. చివరికి కళ్లల్లోంచి ఇన్ని నీళ్లు ఎక్కడినుంచి

వస్తున్నాయో కూడా ఏమీ అంతు తెలియటంలేదు. నేను ఏడుస్తూవుండగా ఎవరూ చూచివుండరు. ఏ మాట మీదైనా పట్టుదల వస్తే బడిపంతులు నా వీపుమీద ఈతబెత్తాలు విరగ్గొట్టినా ఏడిపించ గలగేవాడు కాదు. 'సుకుమార్' ది రాతి శరీరం' అంటూవుండేవారు పిల్లలు. నేను మనసులో 'శరీరం కాదు మనసు రాతి మనసు' నన్ను చిన్నపిల్లడి లాగ ఏడవ నియ్యదు' అనుకుంటూవుండేవాణ్ణి – అసలు నాకు ఏడ వటమంటే నాకు చాలసిగ్గేసేది. ఇప్పటికి కూడా వుంటుంది. కాని, ఇక సంబాళించుకో లేకపోయాను. ఎవరైనా చూస్తారేమోనని చాటుగా ఏడుస్తూవుండేవాణ్ణి – కొంచెంసేపు ఏడ్చి చప్పున కళ్లుతుడుచుకొని తమాయించుకునేవాణ్ణి, బడికి వెళ్లేప్పుడు దారిలో వందలాది భిక్షుకులు ముష్టెత్తుకుంటూ కన పడేవారు. ఒకడికి కాలు వుండేదికాదు, ఒకడికి చెయ్యివుండేది కాదు, మరొకడికి కన్నువుండేదికాదు – ఈవిధంగా ఎన్నిరకాలైన బాధితులను చూస్తూవుండేవాణ్ణో అంతులేదు. నామాలు పెట్టుకొని ఖంజరివాయిస్తూ 'జయ్‌రాధా' అని భిక్షాటన చేసే వారిని కూడా ఎరుగున్నాను, కాని ఈ భిక్షుకులంతా ఎలాంటి వారు. నేను లోలోన చాలవ్యధపడి,"వీరిని మా వూరు పంపు భగవంతుడా!' అని ప్రార్థించేవాణ్ణి.

సరే, ఆ నిర్భాగ్యభిక్షుకుల సంగతి అటుంచి – ఇక నాసంగతి చెబుతాను. చూస్తూచూస్తూ కళ్లు వాటి ఆసికులై పోయినాయి. కాని నేను విద్యాసాగరుణ్ణి కాలేక పోయాను. మధ్యమధ్య మాదేశ సరస్వతి అమ్మవారు ఎక్కడనుంచి వచ్చి నెత్తిన ఎక్కేదో చెప్పలేను. ఆమె ఆజ్ఞానుసారంగా నేను అప్పుడప్పుడూ సత్కార్యాలు చేస్తూవుండేవాణ్ణి. ఇప్పుడు

తలుచుకుంటే నాకు ఆమెయందు అసహ్యం కలుగుతూ వుంటుంది. నేను రాత్రింబగళ్లు ఎవరికి ఏం అపకారం చేద్దామా అన్న చింతలోనే వుండేవాణ్ణి. ఒకనాటి సంగతి. రాంబాబు గంటసేపు తిప్పలుపడి తన ధోవతికుచ్చెళ్లు పెట్టుకుపోయాడు. దాన్ని సాయంత్రం షికారుకు వెళ్లేప్పుడు కట్టుకుంటాడు. సాయంత్రం ఇంటికి వచ్చి పంచె స్థితి చూడగానే పాపం లబ్బున గోలకెత్తి చతికిలబడిపోయాడు. అదిచూచి నాసంతోషానికి అంతులేదు, పొంగిపోయాను. జగన్నాథబాబు ఆఫీసుకు వెళ్లే వేళయింది. త్వరగా భోంచేసి – వెళ్లాలనుకుంటున్నాడు. అతను భోజనానికి వెళ్లేప్పటికి నేను ఒక చాకు తీసుకొచ్చి అతని చొక్కాగుండీ కోసిపారేశాను. స్కూలుకు వెళుతూ వెళుతూ తొంగిచూద్దును కదా – గోలచేస్తూ ఏడుపుమొహం పెట్టాడు. సంతోషం పట్టలేక నేను దారిపొడుగూన పొట్ట బద్దలయ్యేటట్టు నవ్వాను. సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి "గదాధరుడు నాగుండీ కోసుకుపోయి అమ్ముకున్నాడు. గాడిద కొడుకుని వెళ్లగొట్టండి" అంటున్నాడు. జగన్నాథబాబు గుండీ దొంగతనాన్ని గురించి అన్నయ్యా, రాంబాబూ లోలోన నవ్వుకుంటున్నారు. "ఎన్నిరకాలైన దొంగలనో చూచాను గాని గుండీ తెంపుకుపోయి అమ్ముకు తిన్న దొంగను గురించి ఇవ్వాళే విన్నాను" అన్నాడు అన్నయ్య. జగన్నాథబాబు అన్నయ్య ఈ ఎత్తిపొడుపు విని మరీ మండిపోయాడు. "దొంగ గాడిదా, ప్రొద్దుటిపూట తియ్యలేదు. సాయంత్రపుపూట తియ్యలేదు, రాత్రిపూట తియ్యలేదు, సరిగ్గా ఆఫీసుకు వెళ్లే వేళకు – ఈకొంటెతనం చూడండి?" అని అతను ఆ రోజున

ఒకనల్లటి చిరుగుల చొక్కా తొడుక్కొని ఆఫీసుకు వెళ్ళవలసి వచ్చింది.

అందరూ పక్కన నవ్వారు. జగన్నాథబాబు కూడా నవ్వక తప్పలేదు. కాని నేను నవ్వలేకపోయాను. నిజంగా గధాధరుణ్ణి వెళ్ళగొడతా రేమోనని నాకు భయం వేసింది. పాపం వాడు ఒట్టి తెలివితక్కువవాడు, ఏమీ మాట్లాడక మెదలకుండా తప్పంతా తననెత్తిన వేసుకుంటాడు, ఇప్పుడు బహుశా అన్నయ్య గ్రహించి వుంటా డనుకుంటాను. గుండీ ఎవరు తీసిందీని - పాపమా గదాధరుడు ఏమీ చెయ్యలేదు. నే నా రోజునుంచి ఇంకెప్పుడూ ఇతరుల నెత్తిన ఆపదలు వచ్చిపడే అలాంటిపను లెప్పుడూ చెయ్యవద్దని ప్రతిజ్ఞ చేశాను.

అలాంటి ప్రతిజ్ఞ నే నంతకు ముందెప్పుడూ చెయ్యలేదు. ఇంకెప్పుడైనా చేస్తానో చెయ్యనో కూడా చెప్పలేను. కేవలం గదాధరుని మూలాన్నే నా దాకి తప్పవలసి వచ్చింది. నన్ను అతను మట్టి చేశేశాడు.

ఏతావతా ఎవరిచరిత్ర బాగుపడుతుందో – ఈసంగతి ఎవరూ చెప్పలేరు. గురువులు, తాత ఇంకెంతో మంది మహాశయులు లక్షప్రయత్నాలు చేసినా చేయని ప్రతిజ్ఞ (బహుశా ఇంకెప్పుడూ చేసేవాణ్ణి కూడా కాదేమో) ఒక్క గదాధరుని మొహం చూచి చేయవలసి వచ్చింది. తర్వాత ఇంతకాలం గడచి వచ్చింది. ఈమధ్య ఎప్పుడైనా ప్రతిజ్ఞాభంగమైందో లేదో కూడా చెప్పలేను. బుద్ధిపూర్వకంగా మాత్రం ఎప్పుడూ చెయ్యలేదు.

ఇప్పుడు మరో మనిషి విషయం చెబుతాను. అతను

మా నౌకరు రామా. రామది గొల్లో, లేకపోతే అలాంటిదే ఇంకేదో జాతి. ఎక్కడ వాడో - ఇది కూడా చెప్పలేను, వాడంత తెలివితేటలు గల నౌకరును నే నెక్కడా చూడ లేదు. ఇంకెప్పుడైనా కనపడితే వాడి వూరుపేరు అన్నీ అడిగి తెలుసుకుంటాను.

పనులన్నిటికీ రామా రాట్నంలాగ తిరుగుతూ వుండే వాడు. ఇప్పుడు గుడ్డలు వుతుకుతూ చూస్తే మళ్ళా క్షణంలో అన్నయ్య వీపు తోముతూ కనపడతాడు. ఇంకొంచెం సేపుండి ఆకువక్క అందిస్తూ వుంటాడు. ఈ విధంగా ఎప్పుడు చూచి నా అతను ఏదో పనికి పరుగెత్తుతూ వుండేవాడు. అన్నయ్యకు అతను చాల 'ఫేవరెట్' — చాల ప్రియమైన నౌకరు. కాని నాకు అతనంటే పడేదికాదు. ఆ గాడిదకొడుకు మూలాన నేను అన్నయ్యతో నానామాటలూ పడాల్సి వచ్చేది ముఖ్యంగా గదాధరుణ్ణి వాడు చాల ఏడిపిస్తూ వుండేవాడు. నాకు అతనంటే అరికాలిమంట. అయితే ఏమి లాభం! అన్నయ్యకు వాడు 'ఫేవరైట్' అయిపోయాడు రామబాబుకి కూడా అతనంటే కంటగింపే. ఆయన వాణ్ణి 'రూజ్' (రంగునక్క) అంటూ వుండేవాడు. అప్పుడు మేము ఈశబ్దాన్ని గురించి ఎక్కువ వ్యాఖ్య చేయగలిగేవాళ్లంకాము. అసలు వాడు 'రూజ్' అని మాకు బాగా తెలుసు. అతను మండిపడటానికి అనేక కారణాలున్నాయి. ముఖ్యమైన కార ణం — వాడు తన్ను రాంబాబూ — అంటూ వుండేవాడు. అన్నయ్యకూడా అప్పుడప్పుడూ వాణ్ణి 'రాంబాబూ' అని పిలుస్తూ వుండేవాడు. కాని రాంబాబుకి ఇదేం బాగుండేది కాదు.

ఒకనాడు సాయంత్రం అన్నయ్య క్రొత్త లాంపొకటి కొనుక్కొచ్చాడు. చాల నాణ్యమైన వస్తువు. ఏభై అరవై రూపాయల ఖరీదు వుంటుంది. సాయంత్రం అంతా పచారుకు వెళ్ళిపోయిన తర్వాత నేను గదాధరుణ్ణి పిలచి చూపించాను. అతనుకూడా చాల సంతోషంతో - ఒకటి రెండుసార్లు అటూ ఇటూ తిప్పి చూచి తన పనిమీద తాను వెళ్ళిపోయాడు. కాని నా క్యూరియాసిటీ (కుతూహలం) మాత్రం ఇంకా తగ్గలేదు. నే నా చిమ్నీ తీసి చూద్దా మనుకున్నాను. ఎలా తీయాలో, లోపల ఎలాంటి మిషను వుందో చూస్తాను. చాలాసేపు అటు తిప్పి - ఇటుతిప్పి చూచాను. లాభం లేకపోయింది. చాల అబ్జర్వేషను తర్వాత క్రింద ఒక స్క్రూ చూచాను. కనపడిన తర్వాత తిప్పకుండా వూరుకోలేకపోయాను. తిప్పుతూనే వున్నాను. చప్పున దాని క్రిందభాగం వూడి వచ్చింది. స్క్రూ విసురు నే నాపలేకపోయాను. పర్యవసానం దాని గ్లాసు టేబిలుమీదనుంచి క్రిందపడి ముక్కలు ముక్కలైపోయింది.

## 3

ఆ రోజున చాల ప్రొద్దుపోయి ఇంటికి తిరిగి వచ్చాను. ఇంటికి వచ్చి చూద్దును గదా - పెద్ద గల్లంతు చెలరేగివుంది. అంతా గదాధరుని చుట్టూ మూగి వున్నారు.

గదాధరుని కళ్ళవెంట బొటబొట కన్నీరు వున్నాయి. "నేను దానిని ముట్టుకున్న మాట

పగులగొట్ట లేదు బాబూ! సుకుమారబాబు నాకు చూపించాడు. నేను కంటితో చూచి వంట చెయ్యటానికి వెళ్లాను. ఆయన షచారుకు వెళ్లాడు" అంటున్నాడు.

ఎవరూ అతనిమాట నమ్మలేదు. చిమ్నీ అతనే పగులగొట్టాడని నిర్ధారణ చేశారు. అతని జీతం బాకీ వుంది. దానిలోంచి మూడున్నరరూపాయలు వెగ్గోసి కొత్తచిమ్నీ తెప్పించారు. సాయంత్రం లాంతరు వెలిగేప్పటికి అంతా సంతోషించారు. నా కళ్ళుమాత్రం చింతనిప్పుల్లాగ అయిపోయినాయి. హృదయంలో ఎప్పుడో అతని తల్లిదగ్గర మూడున్నర రూపాయలు దొంగిలించా ననే – తలుపుకు రా సాగింది.

ఇక నేను అక్కడ వుండలేకపోయాను. ఏడ్చి మొత్తుకొని అన్నయ్యను ఏదోవిధంగా ఒప్పించి వూరువెళ్లాను. అమ్మమ్మ దగ్గరనుంచి డబ్బు తీసుకొచ్చి మొదలకుండా గదాధరునికి మూడున్నర రూపాయలకు బదులు ఇంకా మూడున్నర వేసి ఇద్దామనుకున్నాను. నాచేతులో అప్పుడు డబ్బేమీ లేదు. ఉన్నదికాస్తా అన్నయ్యదగ్గర వుంటుంది. అందుచేత డబ్బుకోసం నేను ఇంటికి రావలసి వచ్చింది. ఒక్కరోజుకంటె ఎక్కువ వుండవద్దనుకున్నాను. కాని జరిగింది మాత్రం వేరు విధంగా. తాత పెట్టిన గడువు ఇంకా చాలరోజు లున్నా ఏ డెనిమిది రోజులు అక్కడే గడచిపోయింది.

ఏడెనిమిది రోజులుండి మళ్లా కలకత్తావచ్చాను. ఇంట్లో అడుగు పెట్టగానే 'గదా' అని పిలిచాను. ఎవరూ పలకలేదు. 'గదాధర్!' అని మళ్లా పిలిచాను. కాని ఈ సారికూడా ఏమి సమాధానం రాలేదు. మళ్లా 'గదా' అని కేకేసేప్పటికి

రాముడు వచ్చి "ఇదే రావటమా, చిన్నబాబుగారూ?" అన్నాడు.

"అవును. ఇదే రావటం. అయితే గదాధరుడు ఎక్కడ?"

"గదాధరుడు లేడుగా?"

"ఎక్కడికి వెళ్ళాడు?"

"బాబుగారు అతన్ని వెళ్ళగొట్టారు."

"వెళ్ళగొట్టారా? ఎందు కని?"

"దొంగతనం చేశా డని!"

మొదట నాకేం అర్థం కాలేదు. అందుచేత కొంచెం సేపు అతని మొహం కేసి చూస్తూ వుండిపోయాను. రాముడు నా మనసులో భావాన్ని గ్రహించి కొంచెం చిరునవ్వుతో "ఇంకా ఆశ్చర్య మెందుకు చిన్నబాబూ? కాని మీకు వాడి బుద్ధి సరిగా తెలియదు కాబట్టే అంత ప్రేమిస్తారు. వాడు కానరాని దెయ్యం. ఆతడి పినతల్లిని నేను బాగా ఎరుగున్నాను బాబూ!" అన్నాడు.

వా డెలాంటి కానరాని దెయ్యమో, ఆతడి పినతల్లిని నే నెందుకు గుర్తించలేదో నాకేం అర్థం కాలేదు. "ఎవరి డబ్బు కాజేసాడు వాడు?" అడిగాను నేను.

"పెదబాబు గారిది"

"ఎక్కడ వుంది డబ్బు"

"కోటుజేబులో"

"ఎంత డబ్బు వుంది?"

"నాలుగు రూపాయలు"

"ఎవరు చూచారు?"

"కంటితో ఎవరూ చూడకపోయినా చూచినట్టే నను కోండి!"

"ఎందుకని?"

"దీనికి ఇంకా వేరే అడిగేదేముంది. మీరు ఇంట్లో లేరు; జగన్నాథబాబు తీయడు. నేను తియ్యలేను. ఇం కెక్కడికి పోతుంది; ఎవరు తీస్తారు? చెప్పండి."

"అయితే నువ్వు వాణ్ణి తీస్తూవుండగా పట్టుకున్నావా?"

రాముడు నవ్వుతూ "లేకపోతే ఇంకెవరు పట్టుకుం టారు?" అన్నాడు.

నేను వంటింట్లోకెళ్లి ఏడ్చాను. వాడి ఆ నల్లటి హుక్కా గొట్టము మూలపడి వుంది. దాని నిండా దుమ్ము కొట్టుకుని వుంది. నాలుగైదు రోజుల నుండి దా న్నెవరూ ముట్టనుకూడా ముట్టలేదు. దానిలో అతను పోసి పోయిన నీళ్లు అలాగే వున్నాయి. ఎవరూ పారబొయ్యలేదు. గోడమీద ఒకమూల "సుకుమార బాబూ! నేను దొంగతనం చేశాను. అందుచేత ఇక్కడనుంచి వెళ్ళిపోతున్నాను. బ్రతికి వుంటే ఇంకెప్పుడైనా వచ్చి కలుసుకుంటాను" అని వ్రాసి వుంది.

ఇంకా నే నప్పటికి క్రూరవాణ్ణేగా! ఆ హుక్కా వీక హృదయానికి అదిమిపెట్టుకొని పసిపిల్లవాడిలాగ వెక్కి వెక్కి ఏడ్వసాగాను. ఎందుకో... ఆ సంగతి నాకు తెలియదు.

ఇక ఆ యింట్లో నాకు బాగుండలేదు. సాయంత్రం ఇంటికి వచ్చిన తరువాత మళ్లా ఒకసారి వంటింట్లోకి వెళ్ళి—

కొత్త వంటవాడు వంటచేస్తూ వుండటం చూచి మెదలకుండా తిరిగి వచ్చేవాణ్ణి. నా గదిలోకి వచ్చి పుస్తకం తెఱచి చదవ టానికి కూర్చునేవాణ్ణి. అప్పుడప్పుడూ అన్నయ్యమీదకూడా నాకు కోపం వచ్చేది. అన్నంకూడ విషంలాగ వుండేది.

*   *   *

చాల కాలానికి ఒకరోజున అన్నయ్యతో "నువ్వు చేసిం దేమిటి అన్నయ్యా?" అన్నాను నేను.

"ఎవరికి ఏమి చేశాను?"

గదాధరుడు నీ డబ్బు ఎన్నటికి దొంగిలించి వుండడు. నేను గదాధరుణ్ణి ప్రేమిస్తా నని అందరికీ తెలుసు"

"ఆఁ చేసిన పని మంచిది కాదు సుకుమార్. సరే, అయిపోయిం దేమిటో అయిపోయింది. అయితే నువ్వు రాముణ్ణి అంత బాదింది ఎందుకు?"

"బాగా బాదానా? నన్నుకూడా వెళ్లగొడతావా ఏమిటి?"

నా నోటివెంట అలాంటి మాట రావటం అన్నయ్య ఎప్పుడూ వినలేదు. నేను మళ్లా "నీ డబ్బు ఎంత వసూలైంది?" అని అడిగాను.

అన్నయ్య చాల వ్యథ పడి "చేసిన పని మంచిదికాదు. జీతం మూడున్నర అయింది. మినహాయించాం. నా కంత ఇష్టం లేదు" అన్నాడు.

నేను వీధివెంట వెళుతున్నప్పుడు నల్లటి మురికి పంచె కప్పుకొని ఎవరైనా దూరంగా కనపడితే ఎంతో ఆశతో,

ఆప్యాయంగా పరుగెత్తుకు వెళ్లేవాణ్ణి. కాని నా మనోభీష్ట
నెఱవేరేది కాదు. నా ఆశ నిత్యం నిత్యం నిరాశగా పరిణమిం
చేది. నేను నా మనసులో సంగతి ఎవరికి చెప్పను?

షుమారు ఆరునెల్ల తరువాత అన్నయ్య పేర ఒక మ
యార్డరు వచ్చింది—మూడున్నర రూపాయలు. అన్నయ్య
కంటి తడి పెట్టటం నే నావాళ మాత్రం చూచాను. దా
కూపను ఇంకా నావద్దే వుంది.

ఎన్నెల్లు గడచిపోయినాయో అంతులేదు. కాని ఇవా
ల్టికి కూడా గదాధరుడు నా హృదయంలో సగభాగం ఆ
మించుకొని వున్నాడు.

